

# శుచిముఖి



ముమ్మిడివరం,

నూకల సీతారామమూర్తిచే,

రచింపఁబడియె.

మొదటి కూర్పు.

1930.



వెల ౧౦ అణాలు.]

[ౘపాలాఖుష్చులు ప్రత్యేకము

శ్రీ

# శుచిముఖి.

## ప్రథమాశ్వాసము.

అక్కటా! కల్పవృక్షోత్తమములారా! ఆ క్రూరదానవాధిరోహణతాడనభంజనాదులకు మీరెట్లోర్చుకొనుచుండిరో కదా! పూజ్యములగు సంతానకములారా! ఎండి, కుళ్లి, దుర్గంధపూరితములగు మనుష్యమాంసముల నెట్లు పూనుచుంటిరో కదా! ఓ హరిచందనములారా! నీచరాక్షసగజవ్రాతంబులకు మీరు కట్టుకంబంబులైతిరిగా! ఓ మందార భూరుహములారా! దైత్యస్వేదవస్త్రసంతతులం దాల్పునని మీకు మూడు పంక్తుల బ్రహ్మవ్రాసెనా! కష్టం! ఇట్టి దైవోపహతుండగు రాజు పాలనంబుననుంట మీకును బుట్టిమునుకయయ్యెంగదా! ఔరా! ఆరక్కసుని పోతరమేమి చెప్పుదును! నాపై మొన్నమొన్న నెన్నఁగాని దాడివెడలి నన్నొక తృణప్రాయునిగాఁ జూచుచు నచ్చరపూవుబోండ్ల శాతనఖాగ్రంబులను జల్లఁబడిన తేటనీట వర్ధిల్లిన లేఁజిగుళ్లుగల నందనవనంబున మహాసేనానీకము విడియించి చెప్పరానిచేతలనెల్లఁ జేయించుచుండె. నయంబున "అన్నా! మనమక్కచెల్లెండ్ర బిడ్డలమై యింత దుర్మత్సరంబునఁ గలహించిన లోకులు మనలఁజూచి నవ్వకుందురే?

ఒకరు చెప్పినట్లొకరు వినుకొనిన "అన్నదమ్ములసరాగమన
వీరిదేకదా" యని మనల నాదర్శప్రాయముగాఁ జేసుకొని
యెంత సంతసింతురొ"ని నేనెంత శాంతముగాఁ జెప్పినను వినఁ
డుగదా! ఎంతపాపంబుసేసితి? కాన్కలుసాలవన్న నూరుంబేరు
లేని యారక్కసునకు మ్రొక్కి మిక్కిలిగాఁ గాన్కలంపియుం
టి! "ఒరీ! అమృతంబుదెచ్చి పోయవేటి"కని యదలించు నా
యాశపాతకునకు "ఇదిగో! తెచ్చెదనదిగో" తెచ్చెదనని ప్రి
యముసెప్పి యెట్లో తప్పించుకొంటి. అబ్బా! ఆతఁడు నాపైఁ
బడిన దృశ్యము దలంచుకొనిన నిప్పుడుమైగగుర్పాటు నొందు
చున్నది. మెటియలవంటి రక్కసులు క్రొవ్వున ద్వారపాలు
రనదిూపించి వారిని నేలఁబడఁద్రొక్కుచు నాసింహాసనాగ్ర
భాగంబున కరుదెంచి నన్నుఁ గ్రిందఁ బడద్రోసిరి. తపోధను
లారా! లోకంబునందెరికిని వెరవని మీరుగూడ నా నాఁడు
గ్రుక్కుమిక్కుమనకుండ నొకమూల నొదుఁగవలసిన వారలై
తిరిగదా! "నీవెంతకాలము రాజ్యమేలితి వంతకాలము మేము
ను రాజ్యమేలవలయుఁ గాదందువేని నిదిగో నీప్రాణంబులు
నాచేతనేయున్న"వని నాపైఁ గత్తిదూసిన యామాంసాశను
నకు "నిరుతెగలవారము కశ్యపుసంతానమువారమేకదా? మ
నవివాదంబులందీర్ప నా కశ్యపుఁడే యర్హుండనిచెప్పి వాని నా
మహామునీంద్రునికడకుం గొనిపోవనాతఁడు యజ్ఞదీక్షితుండగు

డప్పటికా ఘోరదానవుని వజ్రపురంబునకుఁ జనుమని యాజ్ఞా
జ్ఞాపించె. అంతనే దలఁదడివి చూచుకొని "పులినోటఁజిక్కి ది
డి పడినకండవలెఁ జెనుచేటు దప్పెనని సంతసించితిని గాని
యావజ్రనాభుఁ డెప్పుడేమరిపాటున వచ్చి పైఁబడి నా తనూనఁ
ప్రాణంబులఁగైకొనునోయని లోలోనఁ గుల్లిపోవుచుంటి. వజ్ర
నాభుఁడు సామాన్యుఁడుగాఁడు. బ్రహ్మాదుల బ్రహ్మాండమైన
తపమునఁ బ్రసన్నుఁ జేసుకొని మేరుగిరి ప్రాంతంబున శీతవ
ర్షాతపములకైనఁ జొరశక్యముగాని వజ్రపురమును నిర్మించు
కొని తేజంబున మధ్యందినమార్తాండుఁడై వెలుఁగుచున్నవాఁ
డు. వానిని గెలుచు వెరవేదియును గానరాదు. ఇప్పుడేమి
సేయుదును! చేయుటకుమాత్రమేమున్నది. అఖిలవిశ్వంభరుఁ
డఖిలలోకరక్షాదక్షుండునగు పంకజనాభునకెఱిఁగించి నా మొఱా
లింపుమని వేఁడుకొందు"నని సురలోకాధిపతియగు నిందుఁడు
తక్షణంబ దానిటువాపోయి ద్వారకానగరంబునకుఁ బయలుదే
రెను.

వివిధమణిమయగృహాదీప్తిసందోహవ్యాప్తిచేఁ బరిశో
భితంబును, కీర్తిపూఁదేని సోనకాలువల కాకరంబునునగు
నాద్వారకానగరము నానాకవిభుఁడుచూచి యాశ్చర్యచకితుఁ
డై, యందుఁ బ్రవేశించి కక్ష్యాంతరంబులుదాఁటి కృష్ణనివాసా
గంబున నెదుర్కొనవచ్చిన సాత్యకి వెంబడిగా వారి నన్నిధిఁ

సంభావించి యాజనార్దనుండున్న పెనుగద్దియకడఁజేరి పీఠోప విష్టుఁడయ్యె. నారాయణుండు కుశలప్రశ్నముగావించి వచ్చిన కారణ మేమని యద్దివిజనాయకునడిగెను. నాకాధిపతి చేతులు జోడించి "లోకనాయకా! అఖిలవిదుఁడవగు నీకుఁ దెలియని దేదికలదు. నామనోవ్యథాభర మెల్ల నీవెఱింగినదేకదా" యని పలికినతోడనే యాతేఁడొక్క నిముసము నిమీలితనయనుం డై కన్దెఱచి "నాకాధిపా! నీఖేదాతిశయంబెల్ల నాకు హృద యగోచరమయ్యె. విచారంబుడుగు"మని యోదార్చె. "దేవ దేవా! ఉడుగుమనినంతమాత్రమున నీవిచారంబుడుగునదికాదు ఆదురాత్ముండగు వజ్రనాభుఁ డెప్పుడేమటిపాటునఁ బైఁబడు నో తెలియరాదు. బ్రదికియుండిన నింత బలుసాకైనఁ దినవ చ్చును. నాయెత్తు ధనము పోసినను నాకీ స్వర్గము గిర్గము వలదు. ముకుమూసుకొని యిచ్చట నిన్నే సేవించుచు దినము లు పుచ్చెద"నని యతిదైన్యంబున వేఁడుకొను దివిజేశ్వరుపా టెల్ల నారసి "ఇంద్రునంతవాని కెట్టిపాటువాటిల్లె"నని విచా రించి "ఓ పాకశాసనా! నీవిట్లాడుట న్యాయమా? ఓడలు బం డ్లు బండ్లోడలు నగుచుండును. కొండ్రవ్వి తుమ్మ్ర్లిపడిన కూర్రరా తుసు లెందఱెందఱు నశించిపోలేదు. వానికి వినాశకాలము స మీపించుటచే వాఁడిట్టిపనికిఁ గడంగె. సత్పురుషుల చిత్తము లు నొవ్వఁజేసిన నూరకపోవునే? వసుదేవుఁ డిప్పుడొక మహా

యజ్ఞంబు సేయఁదలంచియున్నవాఁడు. ఇంద్రా! అయ్యది నీకొఱకేకదా! అది యెప్పుడు సమాప్తంబగు నప్పటి నుండి యు మనమిరువురముగూడ నామిష్టరాత్రించరుని సాధించుట కుఁ బ్రయత్నింతము. కాని వాని సాధించుట యల్పకార్యంబు గాదు. నీవును మారుతాతపముల కైనఁ జొరశక్యముగాని త త్పురము ప్రవేశించువెరవేదియో, వాని నెవ్వఁడు జయింపఁ గలఁడో యోజించుచుండుము. ఏనును దత్ప్రయత్నంబున నుం డెద" నని హితముపదేశించి యింద్రుని వీడ్కొలిపి వాసుదే వుండు వసుదేవయజ్ఞనిర్వహణ ధూర్వహుండయ్యె.

ఆ వసుదేవ యజ్ఞావలోకనంబునకై దేశదేశములనుండి వచ్చిన బంధుమిత్రాదుల నర్హసన్మానములచే సంతృప్తులం జే యుతఱి భద్రుఁడను నటుఁడచ్చటకువచ్చి నిజనర్తనకళాప్రవ ర్తనంబున నెల్లవారల నానందసాగరంబున నోలలార్చె. తద ధ్వరసభాసదులైన మునిప్రవరులా భద్రుని నటనకుఁ బరితు ష్టులై యనేక వరంబు లొసంగిరి. దివ్యదుకూలాభరణంబు లనేకంబు లితరులు వానికొసంగి వారివారి సంతసమును వెలి పుచ్చిరి. భద్రుఁడా పారితోషికములంబొంది వారిని స్తుతిం చుచుండెను. ఆసమయంబున ధూర్తులైన వటులు గొందఱొ కరినొకరు తలకొనసెచ్చరించి తమ దండపుఁ గోలలందు వ్రే లుచున్న గోఁచులూడఁ బెఱికి యానర్తకునిపైఁ బడవైచి త

మ్మనుగూడఁ బోగడుమని యడిగిరి. భద్రుఁడు మందహాసం బున నాగోఁచులఁ జుట్టిపట్టి "ఓహోహో" యని వాని నెగురవేయుచు వారినిఁ బొగడఁ దొడంగెను. ఆపొగడ్తల కవ్వటువులు నవ్వి దుండగంబున "ఓరీ! ఆటకాఁడా! ఇట్టి ముఖ ప్రీతి వాక్యములవలన మాకు మెచ్చుపుట్టుననుకొంటివా! నీవు గోఁచు లపహరింపఁ దలంచితివేమో? మావి మేము లాగు కొనక మాన" మని యొక్కుమొగి వానినిఁ జుట్టుముట్టిరి. ఒక్క వటువే వేయిమర్కటముల పెట్టుగదా? అందఱు బ్రహ్మచారులు చుట్టుముట్టఁ బాప మాతఁడేమి చేయఁగలఁడు? భద్రుఁడు తన మేళగాండ్ర నవలోకించి "ఈబాలురు మనము ధరించిన సొమ్ములందే మేని నపహరింపఁ జూచుచున్నవారు. కావున జాగరూకులై యుండు" డని పలికిన నబ్బాలకులు గడు సుఁ దనంబున నధిక్షేపించి,

"సీ. ఏము మ్రుచ్చులమె యూహింప మ్రుచ్చుఁదనాల
పుట్టినయిండ్లు మీాబోంట్లుకాక
యాటవాఁడ్రని నమ్మి యనుమతింపఁగ నట్టి
పురమైన నశ్రమంబునను జొచ్చి
పగలెల్ల నాటల బ్రమయించుచును సందు
గొందులెల్ల నెఱింగికొనుచు రేలు
కన్నగాండ్రగుచు నగళులు ప్రవేశించి

యందు నెంతటివార లద్ధమైనఁ
గీ. జక్కఁడఁచుచుఁ బేను గ్రుక్కినపాటిగా
నిష్టమైన యర్థమెల్లఁ బడసి
బ్రిదుకుచునికి మీస్వభావమింతయును ద
ప్పదు యదార్థమనుచుఁ బలుకుటయును”
ఆబుడుత లవ్విధమున నుడువుచుండఁగా వనజాక్షుం డిందరికా
ర్యంబు నెఱవేర్ప నుపాయ మాలోచించువాఁడై యా వటువు
లే వాక్యములు శ్రద్ధగావిని నిజాపేక్షకు నుత్తరంబుగ గ్రహిం
చి “విప్రవాక్యం జనార్దనః” అను పలుకు నిజమగుఁగాక యని
వటువచనంబు లుపశ్రుతిగఁ జేసికొని వాని సహాయంబున వజ్ర
పురప్రవేశంబును, వజ్రనాభ వినాశంబును ననాయాసంబుగాఁ
గాఁగలవని మనమున సంకల్పించుకొనియుండె.

విశ్వంభరునియొద్ద సెలవు దీసుకొని వెడలిపోయిన
యిందుడును రాక్షసవధకు రంధ్రాన్వేషణంబు సేయుచు
నొక్కనాఁడు స్వర్ణదీతరంగ క్రీడాలాలసములగు రాజహంస
ముల రావించి యతిగౌరవంబున “నోవిహంగోత్తమములారా!
నాకిప్పుడు మీయక్కర యొదవె. మీరు దక్క యికార్యం
బొరులొనర్పఁ జాలరు. నాకీ యుపకారం బొనరింపవలయు
నని యడుగు నమరనాయకునకుఁ జక్రాంగములు “అల్పజం
తువులమగు మే మమరనాయకున కొనరించు నుపకారముంగ

లదె? కలిగెనేని మాభాగ్యంపు కలిమి కేమనవలయు నానతీగ దే" యని వేఁడు హంసలకు సురపతి యిట్లనియె. "ఖగవరులారా! వజ్రనాభుఁడను మిక్కిలి రక్కసుఁడు మముఁ బెట్టిన బాధలు మీ రెఱింగియే యుందురు. వాని నిప్పుడు మర్దింపవలయు. ఈరహస్యము బైటఁబడినఁ గడుంగడు ప్రమాదంబు గలుగు. ఇత్యాది మీ మనస్సునందే పెట్టుకొని మన కంటెవాఁడు మందెప్పు డేకార్యము సేయుచుండునో తెలిసికొనుచు నాపురమున విహరించుచు నాకు వేగు నడుపవలయు. కేళి దీర్ఘికాదుల కలంకారములగు మీ విహారములా వజ్రనాభునకైనను నతిప్రమదంబు గూర్పఁగాదె? మీ రాకపోకల శావంతయు నడ్డుండదు."

దివిజవల్లభునకు శుచిముఖవల్లభుండను మరాళతల్లజుండుల్లంబునఁ బెల్లు సంతసిల్లి వాని యెదుట నిలిచి యంజలిఘటించి "దేవా! ఆవజ్రనాభుఁడు గర్వాతిరేకమునఁ గన్నుఁగానక తన్ను దానెఱుఁగక ప్రవర్తించుచున్నవాఁడు. ఇంతకుమున్నె వజ్రపురినుండియే మేము వచ్చితిమి. వాని రాజ్యంబునం గల రహస్యంబు లన్నియు నెఱుంగుదుము. వాని రాజ్యసంపదయుఁ దుదిముట్ట వచ్చినది. ఈవిషయంబు మున్ను నాభార్యవలన వినియుంటి నిప్పుడే మీ కామెచే వినిపించెదన"ని పలికి తన కలికికిఁ గనుసన్న యొనర్ప నాపక్షి వచ్చి భర్తృనుం

దునను వ్రాలిన "నీవు నాకు వినిపించిన వజ్రనాభు రాజ్యావసాన సామీప్యంబు దేవర కేమియుఁ గొఱంత వెట్టక విన్నవింపుమని"న శుచిముఖి యిట్లు చెప్పందొడంగె. "సురాధినాథా! చాలకాలమునుండి మేము మన శత్రువగు వజ్రనాభుని వీటికిఁ బోవుచుంటిమి. పోకమూనుదమన్న నాకలోకస్వర్ణాబ్జప్రకాండంబు నెల్లఁ బెఱికి యాతఁడు నిజకేళిదీర్ఘికలనాటినాఁడు. అవి లేక హంసలకు మేత నడునదుగదా! కావున వజ్రనాభు నను గ్రహంబు సంపాదించి వజ్రపురంబునంగల తటాకంబులఁ గేళాకూళులు, బొడ్డనబావుల నేయడ్డులేక విహరించుచుంటిము. నిన్నఁ గన్యకాంతఃపురంబునం దొక పద్మాకరంబునఁ బఱగు తటిఁ బ్రత్యక్షమైన రాజ్యలక్ష్మియో యన నొప్పు నొక్క కన్యాలలామంబు చెలికత్తెలు బలిసి కొలువఁ దత్తటంబున కరిగి యందమ్మైన కిమ్మగు గుజవెంద పొదరింట నొంటినుండి యక్కలువ కంటితోడ "నద్భుతంబును, కనివిని యెఱుంగనిదియుఁ గొంతనిజము కొంతస్వప్నము గతిఁ దోఁచు నొక కలగంటి," ననిన నెట్టి రహస్యంబు నాకడ దాచననికదా యొట్టుబెట్టుకొంటివి చెప్పుము"ని చెలినిర్బంధించిన నాపెచెలికిట్లు చెప్పఁదొడంగె:—పార్వతి నాకు కలలోఁ గనుపించి మందహాససుందరవదనారవిందయై "ఓసుందరాంగీ!" అని నన్నుం దన సరసకుఁ బిలిచి లేఁజిగురాకువంటి తన కేల నన్ను నిమురుచు "అధికాశ్చ

ర్యతర రూపలావణ్యగాంభీర్య శౌర్యాదుల నొప్పునొక లేఁబ్రాయము వానిఁ జిత్రఫలకమునందు వ్రాసి "ఈతఁడు నీకు మగఁడు కాఁగలఁడితఁడు ప్రద్యుమ్నుఁడు. మీ యిద్దరకు జనించిన కుమారుఁడీపురమున కధిపతియగునని "ఇదిగో చిత్రఫలక" మని పలికి యంతర్ధానమయ్యెనఁట. ఆచిత్రఫలక మీ పొదరింటనున్నదని పలికిన చెలి యావింత కల కెంతయు నబ్బురవడియె. కావున నోయమరాధిపా! ఇట్టిసమాచారములెల్ల విన్న నా వజ్రనాభునకుఁ గాలము చేరువైనట్లు తోఁచెడిని. ఇది తప్పదు: కల లొకొక్కప్పుడు నిజము కాఁగలవు. అందును వేకువఁ గాంచిన కల మిక్కిలి నమ్మఁదగినది. మఱియుఁ బార్వతి పల్కిన పల్కు బొంకు గానేరదు. అన్నిటికి సాక్ష్యముగాఁ దచ్చిత్రఫలకంబుగూడఁ బ్రత్యక్షసిద్ధము. దేవా! కడుంగడు వివేకించి చూచిన నారాక్షసవిరోధియగు దామోదరుని కొమరున కా తఁడు కూతు నిచ్చుటకు సమ్మతింపఁడు. ప్రభావతీ పతియగు నాప్రద్యుమ్నునకును వజ్రనాభునకును పోరుతప్పదు. ఆమె ప్రభావతి యనియు, వజ్రనాభుని కుమార్తెయనియు నీస్వప్న కథనానంతర మాకాంతల యుత్తర ప్రత్యుత్తరంబులవలనఁ దెలియఁబడియె నదియుంగాక యట్లుచెప్పిన యాయమంగాంచి దాని ప్రియసఖి "చెలీ! ఎంత భాగ్యవతివే? జగన్మాతయగు నాపార్వతిచే మెప్పువడసితివి. ఆగట్టులతేని పట్టి యిట్టిదాని

కిట్టులిట్టి విచిత్రఫలకంబు నింతప్రత్యక్షముగా వ్రాసియిచ్చును. కాని చెలియా! పోతుటీగకైనను దిరుగరాని చోట నిదిపుట్టుట యసంభవమని తోచుచున్నది. నీతండ్రి యెట్టి యెగ్గైన నాచరింపఁ గలవాఁడు. కారణములేక యే పరుల విభవము చూచి సహింపని నీతండ్రి "ఆపార్వతి పేరుపెట్టి యేపాడుముండో యిట్లు వ్రాసిన" దని మముమ్మల బాధించు. ఆచిత్రఫలక మెవరైనఁ జూచినయంతయు బైటపడును. అబ్బా! నీకీడుజోడగు నెట్టి సురూపుని నాతల్లి వ్రాసెనో చూచెదుదాఁక నాకు నిద్రపట్టుటలేదు. నీకు సముఁడైనవాఁడు దొరకుట దుర్లభము. ఆహా! అయంబ చమత్కృతి చూచెద నెక్కడ పెట్టితివో తెమ్మ"నిన నక్కాంతయొక్క పొదరింట నుంచిన యాచిత్రమును దెచ్చి చూపించె. దేవేంబ్రా! ఇదివఱ కామె చూచిన దయ్యె

"చ. కలకల నవ్వినట్ల తెలికన్నుల నిక్కమ చూచినట్ల తోఁ
బలుకఁ గడంగినట్ల కడుభావగభీరతలబ్బినట్ల పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివవ్రాసినట్టి యా
చెలువునకాభిముఖ్యముభజింపఁదలంకెనుదానుబోఁటియున్"

ఆచెలి విస్మయాయత్తచిత్తయై "అబ్బా! ఇంతయంద మెవ్వానికిం గలదు. పార్వతి యంచన వ్రాసినట్లు తోఁచుచున్నది. నీకు జోడుగోరి క్రావలయు నీతని సృజించె" నని పలికినఁ బ్రి

భావతి "ఇవి సఖులు పలుకు నిచ్చకపు మాటలుగాని నిజము
గా నిట్టి యందగాఁడుండునేని నేనాతని పాదము లొత్తుటకైన
నర్హురాలను గానని యనురాగంబు దేటపడు మాటలా బోటి
తోడ సంభాషించినదని శుక్ర చందంబులా మరాళంబు పలికె.

---

## ద్వితీయాశ్వాసము.

— ♦ —

దేవేంద్రుండపేక్షిత ప్రయోజనానుకూల్యంబుకం
టెనారాయించ జాలని శబ్దసంస్కారమునకు, అర్థసంపదలం
బొదలుపదసంపదకును, క్లిష్టముగాని భావమునకును, పొంతఁ
బోవనిపునరుక్తికిని, పూర్తియగునాకాంక్షకును, ప్రస్తుతము
నకు సంబంధించి యుదుటకొను ప్రకృతాంశభావమునకును,
అత్యూర్జితంబగు నుపపత్తికిని పొందని పూర్వోత్తర విరోధ
ములకును, మహావాక్యమునకు ననుకూలపడు నాయాయి
యుపప్రధానవాక్య తాత్పర్యములకును మిక్కిలిగా నచ్చెరు
వడి "నీవు భాషాప్రావీణ్యము చూపవచ్చిన భాషాయోష
వుగాని విహంగమయోషవుగావు." అని పలికె. అంత నా
పులుఁగు "సురేంద్రా! నేను బ్రహ్మరథమును దివుచు సా
రంథరాఖ్యుఁడను మరాళరాజు కుమార్తెను. సరస్వతి పెం
పగాఁ బెఱిగి యామె శిక్షచే విద్యలెల్ల నేర్చితిని." అని బా

ని పూర్వవృత్తాంతం బెఱింగించిన "దేవేంద్రుండు" దానం జేసికాదే నీసామర్థ్య మసాధ్యంబు. మీఁది కార్యంబునకుఁ గలఁతనొందిన నన్నుఁ దేర్చి యెప్పటివలె వజ్రపురంబుసొచ్చి కేలిదీర్ఘికల విహరించుచుఁ బ్రభావతితోఁ జెలిమిసేయుచు నామెకుఁ బ్రద్యుమ్ను నందనురాగం బుదయించు చందంబునఁ బలికి యెవ్విధినైన నాయుద్దరకును సంఘటింపుము. అదియుంగాక యేనంపినట్లుగా వాసుదేవునితోఁ జెప్పి వాని యుద్దేశ్యము గొని చనుమనుటయు నాశుచిముఖి యిందుర్నాజ్ఞంగొని చని కృష్ణుని కోమలపదాబ్జంబులను సత్యయొత్తుచుండ, భద్రాదేవి సురటితో శుశ్రూషసేయ, మిత్రవింద పూలవిసనకఱ్ఱతోవీచుచుండ, సంతసంబునఁ గాళింది కాళంజి దాల్ప, జాంబవతి లేఁదమలపాకులు చిలకలుచుట్టి యీయ, నాగ్నజితి గొడుగు పావలు కేలఁగొని యుండ, లక్షణజలఁకములొండీ వహించి సేవింప రుక్మిణి భక్తిమెయిం భజింపఁ బట్టపుదేవియగు రుక్మిణి తొడతలాడపైఁ దలనిడి, యష్టమహిషీ సమేతుఁడైయున్న కృష్ణునిం గనుంగొని "దేవదేవా! అమరవిభుఁడు నీకొక్కమాటఁజెప్ప నన్నుంబనిచెనని నుడివి రుక్మిణింజూచి తన తనయుఁడు రాక్షసునిపై దాడివెడలున ని రుక్మిణికిం దెలిసిన నామె సమ్మతించునో లేదోయని మనంబున లెస్సగాఁ దలఁచి మాటనేర్పును, బుద్ధికుశలతయు

మెఱయనాహంసి వానితో నేకాంతపుమాటగలదని యావ
లకుఁబిలిచి వజ్రితన్నుఁ బిలిపించుటాదిగాఁ దానచటకువచ్చు
పఱకుఁ గల కథాక్రమంబెల్లఁ జెప్పిన విని వడుగుల పల్కు-
లు పశుత్రిగా నవ్వులుఁగు వచఃప్రసంగంబున మిగిలిన కా
ర్యంబు చక్కవడునని సంతసించి

"చ. బలవిభవాభిశోభితుఁడ భంగురశౌర్యధురంధరుండు కా
వలసిన మాయలున్ద్విజవైరులకంటెఁ గరంబునేర్చు నీ
పలుకులచందమారయఁ బ్రభావతికింబతిగాఁగలాఁడు ని
చ్చలముగరుక్మిణీసుతుఁడుచంపునవశ్యమువజ్రనాభునిన్"

అని హంసీ! ఆపట్టణ మెవ్వరికినిఁ జొరరాదు. మానాయన గారింట యజ్ఞమునకు భద్రుఁడను నటకావతంసుఁడు వచ్చి తన నాట్యగరిమచే మునుల నెల్లర మెప్పించి తన కవధ్యత యు, సప్తద్వీపగమనంబును, నాకాశగతియు, నాట్యంబుల నెవ్వరి రూపువహించె వారలయట్ల తాను భేదమొక్కింత యులేక యుంటయుఁ బడసి యన్నిదీవులనాట నెఱపుచుఁ దిరుగుచున్నాఁడు. వానిపై దితిసుతునకు వేడ్కజనింపఁ జెప్పి యాపట్టణమునఁ జొఱ నాజ్ఞగొనిన వెనుక ప్రద్యు మ్నుఁడే యాతఁడై వచ్చు. ఇది మిక్కిలి ప్రయోజనంబు. దీనికిందగిన యవాంతర కృత్యంబులు తత్తదుపాయంబులు నీవ యెఱుంగుదువు పొమ్ము. సురకార్యంబు నిర్వహింపు

మని పీఠముఁగొలిపిన శుచిముఖి మరాళ సహస్రంబుతో గగ
నంబున కెగసి వజ్రపురంబున కభిముఖంబుగాఁ బోవుచున్న
డు ద్వారకానగర బాహ్యప్రదేశంబున వాహ్యాళి సేయు
నొక్క యువకుఁడు దృగ్గోచరుండయ్యె.

"చ. తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటకమంతనంత నే
పనుపడ నిల్చియుండ జికిఁ బాఱి కెలంకులకుం దొలంగ తా
వెనుకకు నేగుదెంచి కడువేడ్కయొకర్పఁగ బంతి యూఁద నె
మ్మనిగనకంపుఁగోలనడిమింట నెత్రి స్మరఁ దాఁకి కొట్టుచున్"

వెండియు "నిది యెంతపని" యని బంతి నాకాశమార్గంబున
కెగురఁగొట్టుచు నేలపైఁ బడనీయక విచిత్రభంగి గుఱ్ఱమును
దోలుచు నుఱులఁ గ్రిందకుబడ్డ బంతినిఁ బైకిఁ గొట్టుచుఁ
దన చేతనున్న రత్నమయమైన దండము కాంతులు నల్ది
క్కుల వ్యాపించునట్లు బంతియాడుచుండె. తొల్త నాయ
శ్వంబు మండలగతి గల్గించియు, నా వెనుక యేకాకారము
గల గుఱ్ఱముల వరుసయో యనునట్లు చక్రాకృతి గల్గించి
యుఁ దన నేర్పరితనంబు మెఱయఁ గుమ్మరి సారెకైవడిఁ
ద్రిప్పుచుండెను. అతని బుజ్జవముతో మెడమీఁ* జ
ఱచుటచేఁ బరితాపవిహీనమైనదియుఁ గళ్లెపుత్రాడు బిం
చుటచే నెత్తఁబడి కొంచెము వంపఁబడిన మెడగలదియు, సకి
లించుచున్నపుడు ఖలీనకషణముచేఁ జీల్పఁబడిన నెప్పులు

గలదియు, మిన్నులఁ జెమ్మట నురుగులచేఁ దెల్లఁగాఁ జేయఁ బడిన జీనముగలదియునగు గుఱ్ఱమును ప్రద్యుమ్నుఁడు దిగిన తోడనే ప్రజలు సురాళించి మణులు వస్త్రములు గైవెచిరి. అపుడు శుచిముఖి వానిం గాంచి యతండ ప్రద్యుమ్నుండని యెఱింగి "ఓ మరాళములారా! అల్ల యతఁ డితఁడ కావలయు. తొలుత వీనితో మాటాడిపోవుట మనకు లెస్స" యని యాతఁడు వినునట్లు మరాళములతో నుడివె.

అయ్యంచలు నేలచేరువ కేటవాలుగా నతి నిశ్చల ప్రసారితపతత్రంబులై డిగుచు బోరలు తెట్టగిలనొక్కవైపునకు వంచి మలపు తిరుగుచు నంతట ఱెక్కలను చాచి నేలపైఁ గాలుమోపి ఱెక్కలల్లార్చి యావెనుక ముడిచి మొగము లోశవింత యొయ్యారముగ మలంచి యాకలను విదిర్చికొనుచుఁ గనకరేఖలచే నాశ్చర్యము గలిగించుచు నిజాంగరుహావినిర్మిత నాతని కింపునింపుచుండెను. ప్రద్యుమ్నుఁడు పరమానందంబున వాని నుపలక్షించి "పక్షివతంసులారా! తొలుత నితనితో మాటాడవలయు ననుకొంటిరి. మీరెట్టి ప్రయోజనంబున నోడుఁ బోవుచున్నవారలో? కార్యవిరోధంబు సైచియుండరుగదా? సంభాషణంబుల వలన మీరు దివ్యజాతి పక్షులని తోచుచున్నది. కాని సామా

వ్య వర్తకులుగారు." అని శుచిముఖి మృదుమధురవాక్యముల వాని కిట్లనియె. "ప్రద్యుమ్నా! ఇచ్చట మేమింక మాఱెవ్వరితోడను మాటాడరాలేము. దివస్పతి పంపునఁ గృష్ణుపాలికి వచ్చి యతండు వీడ్కొలుప వారి యిద్దరయాజ్ఞల నొడల ధరించి యొకానొకచోటకుఁ బోవుచున్నాము. మా గ్యానమర్పణమానుటంతయుఁ దప్పుగదా! నీయనుగ్రహంబు వడసిపోవుట ప్రయోజనసిద్ధికిమూలము. నీవనుకొనినట్లు మేము దివ్యపదిం గ్రీడించు హంసములము. వెండియు నేము కాశ్యపులము. మమ్మెందు నెందును మాతండ్రి యుపేంద్రుండును నిజపరివారంబులోని వారినిగా విచారించి యారీతిఁ బనిపంచిన నడుచుకొనుచున్నవారము. అన్ని కార్యములయందును నీవు "సరసిజనేత్రుని దక్షిణభుజంబవు" గావున మావిధంబు నీకు విన్నవించుకొంటిమి. ఎల్లపట్టులందును దృష్టిఁబెట్టుకొని యుండుము. మేము పోయి వచ్చెదము."

ప్రద్యుమ్నుఁడు వింతపడి "ఓహో! మీరు పోయెడికార్య మెవ్వరికినిఁ జెప్పరాదేమో? పోనిండు. ఒక్కటి మాత్రము చెప్పుఁడు. "అల్ల యతఁ డీతఁడ"ని యనుకొంటిరే మొదట. నా ప్రసంగం బెచట రాఁగారణము గల్గె. మా ప్రయాణమున కడ్డంకు కాదేని, వదియునుఁ జెప్పవచ్చు

నేనిఁ జెప్పు" డని యాశుచిముఖితోఁ బలికె. గడుసువనం
బున కిక్కయగు నాశుచిముఖి "ప్రద్యుమ్నా! అది రహ
స్యమైనదగుటయు, మేము నిమేషంబు దడయకుండుటయుఁ
గూడ నిజము. అయినను, మాకు నీవన్నను జనార్దనుఁ డ
న్నను నొక్కటెఱంగు కావున మాపనియు నీప్రసంగ కలి
మియుఁ గూడ వివరించెద. వినుమని నలుకెలంకులఁ దిలకించి
సందేహించుచుండ నది ప్రద్యుమ్నుఁడు గ్రహించి యను
చరులకుఁ గనుసన్న యొనర్ప వారది యాజ్ఞగా గ్రహించి
మెలమెల్లగా జాఱిరి. అంత నాహంసి వానికిట్లు చెప్పఁదొఁ
డంగె. 'వజ్రనాభుఁడను నొక ముక్కడిరక్కసునిఁజంప హ
రికిని దేవేంద్రునకును పెక్కు దినంబులనుండి యత్నమెల్లపు
డు నడుచుచున్నది. తమకంటె ముందువాఁడు తమ మీఁద
నేమికీడుఁ దలంచునో యని యెంచి మమ్ము వారు వేగుపం
పగా నావజ్రనాభు వీటికిఁ బోవుచుంటిమి.' ఆపలుకులకుఁ
బ్రద్యుమ్నుఁడు విచారించి "యక్కటా! మఘవా రిదియు
నొక్క దుర్ఘటకార్యముగా నెంచి యెంత విచారించుచున్నా
రు. వారి యాజ్ఞపంపున మేమెంతటి పగయును దీర్పఁజాల
మా! వారి మహిమ వారెఱుఁగక దేనికిని సాహసింపరు.
నన్నొక్కనిం బంపిన నాదురాత్ముని పీచమడంపనే" యని
పలుకు వీరాలాపములకు శుచిముఖి మెచ్చుకొనుచు నతనిం

జూచి యిట్లనియె, "కుమారా! నెరబంటవన నీవుగదా? రక్కసుండెంత బలియుండో కదాయని పిరికితనమునొందక నీవు వానితో ననిసేయ నాసించుట యుక్తమే! పగ్గిల్లదన మునం బనిలేక కయ్యమునకుం బాల్పడక తగిన సంగరము పొసంగినం బిరికికండలేని శూరులు తమంతం దాముయుద్ధమ నిన వేడుకపడుదురు. దానికేమి? నీవప్రసంగము మున్నువ చ్చిన తెఱంగు విన్నవించెద వినుము, చాలకాలమునుండి మేము వజ్రపురంబున కరుగుచుందుము. తత్పురాధినేతకూ తురు భువనమోహిని యనదగు నామెను నొక్కనాండొ కానొక కొలనికడ లతాగృహంబునం జరించుచుండంజూచి వయస్యయుం దానును ముచ్చటలాడుచుండ వినం దట స్థించె. రాజా! ఓహో! ఆ వధూసౌందర్య మేమని చెప్ప దును. ఉపమానంబులకు లొంగక, రూపకమున కవకాశ మీయక, సందేహమునకుం దావీక, పరిణామమునకుం బట్టువడక, యుత్ప్రేక్షల నపేక్షింపనీక, యతిశయోక్తి కవ కాశమొసంగక, తుల్యకుం (తుల్యయోగిత) దుల్యగాక శ్లే షకాశ్లేష మొసంగక, ప్రౌఢోక్తి కేమాత్రమునుబట్టువడక, స్వభావోక్తికినింగూడ స్వాధీనముగాక యొప్పారు నారమ ణీమణి రామణీయక మెంతని కొనియాడంగలను. నేను బ్ర హ్మదేవుని రథవాహనంబైన సారంధరుండను హంసవంశా

ప్రశంసాపరాతురను. తదీయ సంబంధవశంబున లోకేశసన్ని
ధానవాసమునందు వాణి పెంపఁ బెరిగితిని. తదనుగ్రహంబు
న నాకన్ని విద్యలును గరతలామలకము లయ్యె. మన్ముఖం
బున శబ్దసంస్కారపూతంబను బుద్ధి నద్దేవియే నాకు శుచి
ముఖియను పేరిడియె. సరస్వతి యొకనాఁడు నన్నును,
దన చేతనున్న పెంపుడు చిలుకను కవిత సెప్పుమని నియ
మించె. అంత మాయిరువుర కవితయందలి మాధుర్యరస
మునకు గ్రోలి నాకై తఱుం గడు మెచ్చుకొని తన నఖాంచల
మున నాదు తెక్కలఁ జిక్కుచక్కగ దువ్వుచుఁ గృపాదర
వత్సలతాదరంబుల నాకు "ఉపమాతిశయోక్తి కామధేను
వ"న్న బిరుదమిచ్చి యాబిరుదాక్షరముల వ్రాతగల గంద
పెండెరమును నామెయే నాపాదమునఁ దొడిగె" అని తన
కాలియందె యందలి యక్కరముల సముదాయముఁ జూ
పి "ప్రద్యుమ్నా! కవితచెప్పి సరస్వతిని మెప్పించిన నా
కు సయిత మాప్రభావతి చక్కందనంబు వర్ణింప నసాధ్య
ము, పోనీ! ఆమెను చిత్రఫలకంబున వ్రాసియైనను చూపె
దనందునా! ఏయంగమును నేకాగ్రమైన బుద్ధితోఁ దలఁచక
వ్రాయరాదు. అట్లు తలఁచినచో నానందాతిశయమున
మది పరవశమగును. పరాధీన మనస్సుతో నాచెలువ చె
లువము వ్రాయ నశక్యముగదా! అదియుండఁగాక [illegible]

తిమణి రూపమును వ్రాయనేర్చు చేకూరినయెడల నాబ్రహ్మ తత్తుల్యవనిత నెందైనను సృజింపకుండునా! ఆ కాంత తన సృష్టికాదనియు నాదిశక్తియగు పార్వతి తన చిత్రమహిమచే నామెను సృజించెననియు నాబ్రహ్మయే చెప్పగా వినియుంటి. మాటలవెంబడి నది యిప్పుడు జ్ఞప్తికి వచ్చెను. పార్వతీ వరమాహాత్మ్యముచే నామె జన్మించిన దని వినుట బ్రహ్మ చెప్పినదానికిఁ దార్కాణమయ్యె. ఆమె ప్రభావతియను సార్థకనామమున విరాజిల్లుచున్నది. ఒకనాఁ డామెకుఁ గలవచ్చి యాకలఁ బార్వతి ప్రత్యక్షమై యొక్క రమ్యపురుషునిఁ జిత్రఫలకాభిలిఖితుని వ్రాసి యిచ్చెనని నెచ్చెలియగు దానును వేడుకతోఁ జూచుచుండ నేను గన్నులారఁ జూచితిని. మనుపు చూచిన బొమ్మ వృత్తాంతము నిమ్ముఁ జూడకపూర్వము కలుగుటచే బ్రాహ్మ్యమగు నాపురుషుని యాకారముయొక్క పోలికయుంతయు నీకళేబరమునందుఁ జూచి "అతఁ డీతఁడే" యని యనుకొంటి" మని నిష్ప్రహా వభినయించి వట్లభినయించి "ఇంక జాగుచేయుట యుచితంబుగాదు. సెలవొసంగుము. పోయివచ్చెదనని యనుమఁ దోడియుంచవలెను దానును నాకసమున కెగసి వజ్రనాభుని పురమువైపునకుఁ బోయి తొంటిచందమ్ము నకలజలాశయంబుల విహరించుచుండె. అందు శుచిముఖి కన్యాంతః

పురసరోవిహారసమయంబుల వారి సమీపంబున నిలిచి యుఁ బడఁతు లొకొక్కరొకళ్ళపైఁ జల్లు జలబిందువులు తన యొడలుసోకను, దవ్వుచనక యోర్పియుఁ బాటవంబున వా రలలో మెలంగుచు సలవాటు చేసుకొనెను.

ధీమంతుఁ డుపనిషద్వాక్యములచే బ్రహ్మస్వరూప మును విని దాన జనించిన తెలివిచే నది యిట్లుండునని లె స్సగా యోజించి మనసు దానియందే నిల్పునట్లు ప్రియ్య మ్మునందు ప్రభావతీరూపబ్రహ్మమును, హంస సత్యవాగు పనిషత్సిద్ధాంతమార్గానుసారోద్భూత ప్రజ్ఞచే మననము చే యుచుఁ దద్రూపబ్రహ్మమును చిత్తమునందు నిల్పి యొద్ద నున్న వారిని కనక, చెప్పినపల్కు వినక, స్నానభోజనవి ధు లాచరింపక, సేవకానిచయంబు సేవల కిచ్చగింపక శుచి ముఖీవాక్యదర్పణస్ఫురితనిరుపమాన ప్రభావతీమనోజ్ఞరూపు రేఖావిలాససంరూఢమైన యాత్మ మరలింపనేరక యాహ్లా ద్యతరాంగిమూర్తి సొబగొకింత నాత్మలోఁ జూచుచుండును. ఇట్టు లావనితామణి రూపమెయ్యది యయ్యదియే వానికిఁ గననంబడుచుండెను.

నిరన్నమానసంబులకుఁ దెలియరాని వెందును లేవు గదా!

# తృతీయాశ్వాసము.



"ఆకాంతను గన్నులారఁ గనుఁగొనుభాగ్యము కలుగునో లేదో? అదెక్కడిమాట! ఆపురము ప్రవేశించుటయే గొప్పకార్యము! ఒకవేళఁ బ్రవేశించినను నవ్విలాసవతినిఁ జూచుటెట్లు? చూచినను నాకోర్కె ననుసరించి యామె నాయందిష్టము చూపుటెట్లు? శుచిముఖి మాటలనుబట్టి చూడ నాకెంతయు నాస జనించుచున్నది. నన్నుఁ బోలిన వానినే యారుచిరాంగి చిత్రరువునఁ జూచినట్లును చెప్పె. అదిమాత్ర మేమంతస్థిరమైనది? లోకమునందు మనుష్యునిఁ బోలిన మనుష్యులెందఱు లేరు. అయ్యో! ఆమాటగట్టిగా నాశుచిముఖి నడుగక యప్పుడు కోర్కెఁ దాఁచి వట్టి దొరతనంపు నీటు ప్రకటించితి. దానికిఁ దోఁచు పాటు సిగ్గు నానోరదిమిపట్టె. ఔరా! సిగ్గున నాకోర్కె చెప్పకుండుటచే నాకాప్రభావతియందుఁ బ్రేమలేదని హంసికిఁదోఁచెఁగావలయు నింకనిలువక యాహంసి వెడలిపోయెను. నేనుకొంచెము మనసిచ్చిన మాటలు పల్కిన నమ్మరాళి యమ్మృదుకుంతలకై నన్నుఁ గొంచెము బలవంతపెట్టి యేమైన ననఁబూనునని యిప్పు డాత్మకుఁ దోఁచుచున్నది. కాకున్న నాపె ప్రసంగము తానే తెచ్చి తద్రూపము నేల నుతించును?

"శా. అటుగాకద్భుతరామణీయకగుణాఢ్యంబైనసద్వస్తువుం
బటువాచారసికుల్ ప్రసంగమయినన్ బారంబుముట్టన్ రసో
త్కటతం జెప్పకమానఁజాలరనుపక్షంబొంచుభావించినన్
ఘటియిల్లున్ వనితాంగవర్ణనమునిక్కంబన్యథాసిద్ధియున్"

ఆహంసి క్రిందకు దిగి "నరసిజనేత్రు దక్షిణభుజంబవు నీ" వని పల్కుటచేతను, హరియును దానవుండును తన్నంపిన కార్యము చెప్పి నామనస్థితిఁ దెలుసుకొనుటయు నాలోచింపఁగా నన్నాపనికిఁ బంపవలెనను మాటచట పుట్టఁబోలును. అన్నియు నొక్క యభిప్రాయమునే తెలుపు వాక్యమగున ట్లాలోచించిన నాకోర్కె సిద్ధించుననియే తోఁచుచున్నది. నారూపమే యాకన్నియ చేతి విచిత్ర ఫలకంబుననున్నదనిఁ జెప్పినది. నన్నెఱింగిన వారెవ్వరైన వ్రాసిరందునా! శివ వ్రాసినదని వినియుంటినికదా! శివ నన్నే వ్రాసియిచ్చిన పత్రమున నన్నామెకు మగనిఁ జేయు నిచ్చగాక మఱియొండేల కల్గును? కలుగదు. అంతఃపుర కన్యకిట్టి భర్తృపరత దక్క వేఱొండు ఘటిల్లు టరుదుగాన నది యెట్లైనను ప్రభావతి కిష్టుఁడగు తరుణునిఁ బరిశీలించుటే ప్రయోజనముగాఁగల ఫలకమును జాఱరాదు. ఈశ్వరి యిచ్చెనని చెప్ప వింటిఁ గాన నామెయు మోసపుచ్చఁ జాలదు. ఇది యసత్యమగునేమో? కాఁజాలదు! కాఁజాలదు!! బ్రహ్మ చెప్పెనని

కదా వినియుంటి.

"చ. మునుతనసృష్టి కామినలు మోముల వేలుపు చెప్పవింటి నే
నను చుమ రాళిపల్కనపుడక్కట యేనడుగంగ లేన యే
మనినను దిట్టుకొందునజుఁడట్టి ప్రసంగపు వేళనవ్వరా
ననకు విభుండితండతఁడఁనన్ వినఁబడ్డది యేమిగల్గెనో?

ఉ. వావిరినవ్విలాసవతి వార్తలపట్టున నెన్ని యెన్ని ప్ర
శ్నావసరంబులైన నొక యర్థము నేనడుగంగలేమి ని
చ్ఛావిముఖుం డితండని ప్రసంగము వచ్చిననూరకుండు నే
మో! వరటాలలామ యిఁక ముద్దియ సన్నిధి నేమి సేయుదున్

ఉ. పోవునొకో సరోజముఖి పొంతకు నింకొక మాటు హంసిదా
నావలనన్ దదిష్టవచనంబొక టేన్ గొనిపోవఁగా సమీ
బోపుటనిష్ఫలంబను చుఁబోక యె మానునొ కాకపోవునో
దైన తకార్యభారమును దవ్వొశమైచదికొంత గల్గినన్."

ఇన్ని యేల? ఆయంచ యయ్యంచయానకడ కేగతి నేగినను నేఁడలఁచిన కార్యము సిద్ధించును. ఏలనన? నిరాకరింపఁ బడనిది యంగీకరింపఁ బడినదని పెద్దలు చెప్పకొను మాట లా సహోమతి మరాళి యెఱుంగకపోదు." ఇట్లు హారిక మారుం డొక్కనాఁ డేకాంతవర్తియు, హస్తవిన్యస్తగండ స్థలుండునగుచు విరాళిం బొదలుచుఁ బొద్దుగడుపుట భరం బగు నుద్యానవనంబునకుం జని కుసుమ స్మరుచు నును గెంపు

నింపు నూతన పల్లవంబులం గాంచి ప్రభావతి కరతలంబుల నియు, నెలదీఁగియలఁజూచి యామె బాహువులనియు భ్ర మించుచుఁ దదితరంబెల్ల మఱచి ప్రభావతీ మోహాసము ద్రంబున మునిఁగి తేలుచు నిట్లని వితర్కించుకొనఁ దొడం గెను.

ఆశుచిముఖి యిందుఁగ్రిని సెలవుపరికార మొనర్చియే తెంచు టెన్నఁడు గలుగు? దానిచేత నాయభిప్రాయంబు సెప్పియే ననుపు టెన్నఁడు? కావున లేఖ నొకదానిని లిఖిం చి యాయంచకిప్పుడు పనిచెద" నని తలంచి శుచిముఖిపేర లేఖవ్రాసి దానిం గొంపోవు వారెవ్వరని చింతించుచు దుర్ధ మంబైన విరహార్తి కతన వార్తాహరణ యోగ్యాయోగ్య వివేకంబులేక యందుఁ జరించు కీరంబులను, తుమ్మెదలను, కోయిలలను, వాయువులను, మేఘములను, రాయంచలను జూచి "మీరా! మీరా! వజ్రపురికిఁ బోవువా" రని యడు దుగుకొనుచుండు సమయంబున నొక శుకంబు గగనమా ర్గమున నేగుచు నాతని దీనాలాపంబులు విని "ఏను వజ్రపు రికేగెడు దాన. పక్షినగు నేను నీకెట్టి కార్యంబు సేయఁ గలదానను?" అని పలికెను. యాదవుఁడు సంతసంబున "ఓ పక్షివరా! అందు శుచిముఖియను నొకరాజహంసి గలదు. అదియున్నచోటు నీవరసి దాని కీలేఖ నందింపఁ బ్రార్థింతు

ననిన నాచిల్క "అటులనే చేసెద. ఒరుల కగుపడకుండ
నాపక్షంబుల నడుమ నాలేఖను గట్టుమ"నిన నాతఁ డట్లు
చేసె. తోడనే యాపక్షి శీఘ్రగమనంబునం జనియె.

అంతకుమున్నె శుచిముఖియు నుచితప్రకారంబున
రాకుసాంతఃపుర కామినీసమీపసంచార పరిచయంబు సం
పాదించుకొనుచుఁ బ్రభావతితోడి చెలిమి కలిగించుకొను
టకుఁ దఱివేఁచియుండె. ఒక్కనాఁ డారాజకన్యక రాగవ
ల్లరితోఁ దోఁటి సరోవర పరిసరంబునకు వచ్చి వనవిహారం
బు సలుపఁ దొడంగె. తద్విహారాంతరంబున రాగవల్లరిం
జూచి "చెలీ! మత్ప్రాణనాయకుని రూపంబును జూడ ని
చ్చవొడమెడు. తత్ఫలకమును తెమ్మ"ని ప్రభావతి యా
జ్ఞాపించిన నామెచానిం దెచ్చి ప్రభావతికిచ్చె. ఆపెకను దెప్ప
వెట్టక చూచిచూచి యక్కునఁ జేర్చి యొక్కింతతడవు ని
శ్చేష్టయగుచు నిట్టి మనోహరాంగుఁ డెంతైనఁ గలఁడా
యనియు నక్కటా! పార్వతీపూజ సలుపు సమయంబుననే
నేలోపం బొనరించితినో కదా! యనియు నింతటి చెలువుఁ
డు లోకంబునం గలిగిన నది పోక్కకుండునేయనియు ననేక
విధంబుల విచారించు సమయంబునఁ దత్సమీపంబున సంచ
రించు శుచిముఖి యామాటలెల్ల విని యాచెలి చెలిమి కలి
మి సంపాదించుకొనుటకుఁ దగిన యదనదియే యని మది

నూహించి తగు నుపాయంబు వితర్కించి తలవని తలఁపుచే
తనువలె నాతెఱవ యెదుట నడ్డముగా నల్లనల్లన నరుగుచు
విమర్శదృష్టినిఁ బలుమరు మఱలి మఱలి చిత్రఫలకంబువంక
వీక్షింపఁ దొడంగె. ప్రభావతి పక్షిచందం బుపలక్షించు
చు మోమునఁ జిరునగ వంకురింప రాగవల్లరితోఁ "సఖి! ఈ
పులుఁగుతా నేమెఱుఁగునని తిరిగి తిరిగి యీచిత్రఫలకం
బుపై దృష్టిని గుడించుచున్నది." యని పలికె. గపుసుంద
నంబున కిక్కయగు నామరాళి "ఓ పడఁతీ! నీవనినట్లు మా
వంటి తిర్యగ్జంతువు లేమియు నెఱుంగమి యథార్థంబైనను
నేను నీచేతి చిత్రఫలకంబు నబ్రపడి చూచుటకుఁ గారణం
బు సెప్పెద వినుము. తొల్లి నేనొకచోట నొక్క పురుషు
నిఁ జూచి వానితో సమానరూపము గలవానిని మఱియెం
దునుం గానక యిప్పుడిందు నతనికైవడిఁ దోఁచినది తదీ
యరూపం బెఱింగి వ్రాసిన తెఱంగో యటుగాక యట్టివాఁ
డే వేఱొక్కఁ డెక్కడనైనం గలిగెనో యని యించుక వి
మర్శించి వీక్షించితి నంతియకాని యీచిత్రఫలకముఁ జూడ
నాకేమి పని? అయినను నాకేమి తెలియును" అని నిజవ
చో నైపుణ్యంబు మెఱయఁ బలికె. ప్రభావతి యద్భుత
ప్రమోదసందేహంబులు డెందంబునం దుముకొనుచుఁ
గందళింప నప్పులుఁగుం జూచి "ఏమేమీ! హంసీ! ఇంకా

క్క మాటు చెప్పు! ఇదిగో! ఈచిత్రపటమును జూచి యా
రూపు నిజముగనున్నదో యేమేని భేదమున్నదో చెప్పుము.
నీవచస్సామర్థ్యంబు చూచిన నీవు మహాత్మవని తోఁచుచు
న్నది. మాభావము కనిపెట్టలేక దూరదూరముండెదవేల?
నీకింత భయమేటికి? రమ్ము" అని వేఁడుకొనుచున్న ప్రి
భావతి నీక్షించి పక్షి యిట్లనియె. "నీవనినట్లు భయావహు
లను, భయావహులుగానివారిని నే నాకృతినిఁ జూచి కని
పెట్టఁ గలదాననే కాని మీరిరువు రేకతమాడుచుండఁ బి
లువకయ వచ్చుటకు నేనంత వెఱ్ఱినే!"

ఆయిందుముఖి యాప్రౌఢవాక్కుల కాశ్చర్యపడి
కలికి పలుకుల కలరుచు రాగవల్లరితో "సఖీమణీ! ఆ గఱు
వతనంబులాగు లేగరితలందును మును కనివిని యుండలేదు.
దీని జాణతన మింత వింతగలిగించుచున్న" దని పలికి దా
నినిఁ బ్రశంసించి పక్షివంకకుఁ దిరిగి "ఓపక్షికులభూషణంబ!
నీభాషణంబు నిక్కంబు. మేమొక్క సందియంబు నివర్తిం
చుకొనఁ గోరి యిత్తఱి నిన్నత్యంత ప్రార్థనంబు గావించు
న్నవారము. కావున నీవు చూచిన యప్పురుషుని యొప్పు
ను నిప్పలకపై వ్రాసినచొప్పును నొక్కటి యగునో కాదో
యిచ్చటకు వచ్చి చక్కఁగాఁ జూచి నిశ్చయించి చెప్పుము.
ఇట్టివాఁ డెందును లేఁడు కలఁడేని వివాహంబున మే మిద్దర

ము పన్నిదంబు చెఱచినారము." అని ప్రార్థించె. అగడు
సు మాటల నంచతోఁ బూర్యాలి విని తనజాణతనంబు మెఱయఁ
"బందెము కోలుకైన నాకేమి? వేఁకోళ పనికైన నాకేమి?
మీకు నాచే వినవలసిన యర్థము వినిపించెద" నని పలికిన
దాని మాటలకా పడంతులు వీక్షితాన్యోన్య వదనలై "అ
బ్బా! దీని వాక్యాశయ మెంత దూరమరుగుచున్నది." యని
పలుకుచుండ నామరాళి కొంతచేరువకుఁ బోయి యాచిత్రి
మును బాగుగాఁ జూచినట్లు నటించి "ఔనౌను! ఇది యతి
ని గూపమే! సందియము లేద"ని యనుటయు రాగవల్లరి
మోదవిశేష సంభ్రమంబునఁ బఱతెంచి యాహంసి నెత్తు
కొని ప్రభావతి దండఁ బెట్టి కొనగోళ్ల నాయంచ ఱెక్కలు
దువ్వుచు "నీవు మాపాలిట నవతరించిన భాగ్యదేవతవు
గాని హంసవుగావు. ఇట్టి మనోహరాంగుఁ డెందును లేఁ
డని నాతో వాదించు నీప్రభావతి సందియంబుఁ బాపు"
మని రాగవల్లరి వేఁడుకొన నాహంసి యాచిత్రరూపంబు
నిరూపించి, యురంబునందలి ప్రహారకిణంబులును, మోడ
యందలి రతికంకణాంకములును నీతఁడు వీరశృంగారకళా
ఘ్యుఁడని చెప్పకయే చెప్పుచున్నవి. అతని కులగోత్రంబు
లీలక్షణకథనంబుచే నత్యంత ప్రసిద్ధంబులని మీయంత మీ
ర మెఱింగెదరు కావలయు. అంతఃపురవాసినులు గావున
మెఱుంగరో యని మెఱింగించెద నంటినేని

"చ॥ వినయముఁగ నెవ్వరెంత మనసిచ్చివచించిరి తామువారితోఁ
బనఁబడనంతమాత్రిఁబ్రీతి భాషణమాటయు క్తమంతుబ్రిమీ
కొనరఁగఁబన్నిదంపు గెలుపోటలుదీర్పఁగ నిప్పుడేను జె
ప్పినదియ చాలునింకఁ దలపెట్టుట చెల్లద యెక్కుడేమియున్"

నీవు ప్రిభావతివనియు నామె రాగవల్లరియనియు నిపుడు తెలుసుకొంటిని. స్నేహమునుమాత్రియు మఱవవలదు. పోయివచ్చెద" ననుచు వయ్యంచ గగనమున కెగయఁ జూచినఁ బ్రిభావతి తన రెండు చేతుల వినయమొప్ప దానిని బొదుగఁబట్టి తన చెలిమికొడంబడవలయునని ప్రార్థించుచుండ శుచిముఖి "ప్రిభావతీ! ఔ లెమ్ము. నా చెలిమి మీయేకాంతమున కష్టుగదా! మీయాలోచించు కార్యమునందుఁ బరాకుపడక నాకుసెలవిండు పోయివచ్చెదనని పలికె. రాగవల్లరియా పలుకులువిని,

"క॥ పోయెదఁ బోయెద నంచి
ట్లో యంచలతల్లి! యేలయుక్కాడింపన్
మాయేకాంతపుఁ బనికిని
నీయునికి విరోధిగాదు నిర్వాహకమున్॥"

ఇదేనిమిత్తంబుగా స్నేహంబు కావలయునని ప్రార్థించెదము. నీపలుకువిధంబుఁ బరికింప నీకంతయుఁ దెలియుట స్పష్టంబు. అంతిపురములోని వారమగుట మేము యీ

మాట మాటు పెట్టక వేగము చెప్పనేరకున్నారము. నీవు చూచితినని చెప్పిన యాచక్కనివానిని నాచెలి వలచినది. ఇప్పుడాతని వంశాదికథనము చెప్పి యనుగ్రహింపుము. ఇది చెప్పక యెడసేయుదువేని నీ తాంగి నూరక ప్రాణసంకట పడిచిన దానవగుదువు. కావున శీఘ్రంబుగఁ జెప్పి మావృత్త మెల్ల విననుమనిన శుచిముఖి "యంతఃపురకన్యలఁట. తమ తలఁపు ప్రత్యక్షముగాఁ జేటపఱుపరఁట. నా యంతట నేనే యర్థాంతరమును గల్పించుకొని భయపడక యెట్లు పరతరుణ వయస్కులఁ బొగడుదును? సరే అట్లయిన మీమానసికఁ జెప్పెదవినుఁడు." అని యిట్లు చెప్పందొడంగె.

భరతవర్షమున ద్వారకయను పురమొండు గలదు. దానినివర్తింతునన్న నీవిప్పుడడిగిన యువకుని కథావిలంబము నకు నోర్వఁజాలవేమోయని మానివేసెదను. ఆనగరంబున కు శ్రీమన్నారాయణుండను రాజు. ఆనలినాక్షునకు నెనమండ్రు భార్యలుగలరు. అందు రుక్మిణి యగ్రగణ్యయైయొప్పు. ఆమెగువకొక్క కుమారుండు గలఁడు. వానిపేరు ప్రద్యుమ్నుఁడు. అతఁడు శౌర్యమయుండు. బాహాబలంబున కునికి పట్టు. కాంతిరాశి. గాంభీర్యమునకిక్క. సత్కళలకాటపట్టు. రూపముదాల్చినయౌదార్యము. వేయేల? ఉదాత్తగుణము నపూర్వసౌందర్యత యెంత యెంత యుచితంబంతయుఁగల్గి ప్రకాశించుచున్నవాఁడు. ఆయనఘుని రూపమేయిది."

ప్రభావతి యీపలుకులెల్ల నాతురతతో విని సంతో షము పట్టఁజాలక మిక్కుటంబై యది శరీరమంతటను వ్యా పించి చోటుచాలమి లజ్జగావించిన విద్యాభ్యాసముచే నా కాంతారత్న మొనర్చు దాపటికము నతిక్రమించినదో యన ముఖపద్మమును బాగుగా వికసింపఁజేసెను. రాగవల్లరియు నడేసందుగా "చెలీ! దేవివాక్యములకు నిదర్శనముగా నామ జన్మములును వానియునికియు నీపక్షి దయవల్లవింటివి. ఈ హంసీమతల్లి వాక్చాతుర్యంబు చూపఁగడమకార్యంబుగూడ సాధించిపెట్టు దిట్టతనంబీమె కున్నట్లు కాన్పించుచున్నది. సక లార్థ సాధనంబగు మహావిద్వాంసుల సాంగత్యమీమెకున్న ట్లు దీనికాలిపెండెరంబు తెల్పుచున్న"దని పలికి దానికాలి పెండెరంబునందున్న యక్కరంబులుచూచి చదివి యబ్బుర వడి ముదమందుచుఁ బ్రభావతింజూచుచు "సఖీ? మనకొడు వలన్నియు నీపులుఁగుచెలి తీర్పఁగల"దనిచెప్పి తదాదిగా నప్పటి తుదకు ముదితకొదవిన యవస్థలెల్ల సవిస్తరంబుగా వినిపించి యామరాళింజూచి "ఓవిహంగమ పురంధ్రీ! ఇంక మాప్రభావతి బ్రదుకంతయు నీచేతిలోనున్నది. నీవెఱుంగని ధర్మంబులేమ. సఖ్యముసాప్తపదీనమని విద్వజ్జనంబులు వ ల్కుదురు. వేగమ యదుకుమారుని కడకరిగి యీయువతివ పొందగ్గాదులు వ్యాకయంగమంబుగ నభినుతించి యేతన్మ

నోరథం బీడేర్పవలయు”నని ప్రార్థించినశుచిముఖి “యింతీ! మీా నెచ్చెలి ప్రభావతి చక్కదనమెల్ల మున్నొక్కప్రసంగ వశత వానికడ వర్ణించినదానను. ఆప్రసంగమేటికి వచ్చెనని యడిగెదవేమో? చెప్పెదవినుము. నేనిచటనీవనజాక్షినీక్షిం చి చనినదాననై యాప్రద్యుమ్ననిఁజూచి యరుదైనవాని యపూర్వశోభకు నీవిలాసవతి చక్కదనంబు జోడైనది కా వునఁ బ్రసక్తి వెంబడిని వానికడ వచింపగాఁ వలసె. అట్లు వచించునప్పు డాతఁడు “ఔను కాదు” అను వచనంబేమి యుఁ బలుకడయ్యె. ఈమె కాతనియందు వలపు గలదని యపుడు నాకుఁ దెలియదుగదా!” యని పల్కినఁ బ్రభా వతి మనస్సు చివుక్కురుమన వదనము వివర్ణముకా నాహాం సి యదియంతయుఁ జూచి ”చెలీ! ఇంతటితోఁ గార్యము ముగిసెనా యేమి? ఏలవిచారించెద” వని రాజకన్యక నూ రార్చి “అతివా! నిన్ను వినిపించువేళ నాతఁ డేమియు మా టాడకునికి నే నాతనినే తెచ్చి యిచ్చెదనని చెప్పలేను గాని సిద్ధగంధర్వ దైవదైత్యాదికులంబులలో నింక నెవ్వని నీవు గోరినను తెచ్చి యీఁగలదానవని గట్టిగాఁ జెప్పఁగలను. వానిని మాని వేఱొకనిఁ గోరినచో మీా దేవియగు పార్వతి కనుకూలము గాదని యెంచెదవేమో? నీవట్లు తలంపఁ బని లేదు. ఆమె భక్తపరతంత్రగాన నీకెయ్యది యిష్టమద్దియే

యామెకును నిష్టము. కావున సందిగ్ధంబైన యా ప్రద్యు మ్నుని వాంఛవిడిచిపెట్టి నేఁ జెప్పినవారిలో నెవ్వాఁడు గా వలయునన్నఁ దెచ్చి నీకుఁ గింకరునిఁ గావించెద. నీరామ ణీయకమహిమ విన్న నెవ్వఁడు నీకు వశంవదుఁడు గాకుం డు. ప్రద్యుమ్నుఁ డనుపమేయ రూపలావణ్య గర్వంబునఁ గన్ను గానకున్నవాఁడు గావలయు. వాని మాట యటుం డనిమ్ము. తత్సమాను లనరాదుగాని యఖిలభువన సంచా రిణినైన నాకు నక్కడక్కడ మిక్కిలి చక్కని రాకుమారు లెందఱెందఱైనం గనఁబడు చుందురు. వారందఱ లిఖించి కావలయునేని తెచ్చెద. నీ యిచ్చవచ్చిన వానిని వరింపు" మనినఁ బ్రభావతి యామాటలు పెడచెవులంబెట్టి కొంతసేపు చింతించి విచారభరంబున "ఓ అంచలతల్లీ! నే కాంక్షించిన నాప్రియుని యుదంతమెంతయు వింతగా వచించి తుదకు వి రసంబైన వచనంబులచే నన్ను వేధింపఁదగునా? మున్ను మాతండ్రి నా స్వయంవరమునకు నన్ను నియోగించి దేవ గంధర్వసిద్ధయక్ష విద్యాధరాదుల చిత్రంబులను వ్రాయిం చి చూపెను. అందు నాకునచ్చినవాఁ డొక్కఁడును లేఁడు. ప్రారబ్ధ మెట్లున్నదో యట్లు కాఁగలదు. ఈసకల సద్గుణ పూర్ణుని ప్రాయునంతటి సమర్థులు లేకయో, తానెఱుంగక పోవుటనో, యాతఁడు మనుష్యుఁడని యెంచింగియో, మాకు

లమునకు విరోధియగు కేశవుని కుమారుఁ డాతఁడని తెలి
కాని మాతండ్రి వీనిని మును ప్రియుట గానివాఁడు. వరి
యే! అవియన్నియుఁ దలపోసి విచారింపనేల? జగజ్జనని
యగు పార్వతి చెప్పిన పలుకులు వినియు నన్యపురుషుని వ
రియింతునని సందేహింతువేమో? నా మనోరథంబు నెఱుం
గ నెవ్వనికిని శక్యంబుగాదు. ప్రద్యుమ్నునిఁ దక్క నేనొ
రు వరింపనొల్ల. ఆతఁడు నన్నొల్లఁడేని నాతనువు హో
మముచేసి పునర్జన్మమునందైనను వానినే వరించెదను. ఓ
హంసీ! నేనొక్క మాటడిగెద నున్నది యున్నట్లు చెప్పుము.
అమృతమాడిన నాతోడే! నీవే నాప్రాణసఖివి. ఆసుందర
మూర్తికడ కింకొకసారిపోయి నాయవస్థఁ జెప్పి యాత్రుగా
ములు నిశ్చయించి దురాశాపాశమెందును తెగని బంధమై
ప్రాణముల వెలువడనీక నిల్పిన నాయాశఁ దెగఁగోయకు
మదియే నాప్రాణరక్ష," యని నిస్పృహాత్వంబునం బల్కు
ప్రభావతి యనురాగంబ వారణీయంబనియు నాయాశ చె
డకుండ సఫలముచేయక యాలస్యముచేసిన నాపదవాటిల్లి
కార్యంబు దప్పునని యుఁ దలంచి యాశుచిముఖి యామెతో
నిట్లనియె. "ఓ ప్రభావతీ! నీకు వానియందుఁగల యనురా
గంబు గనిపెట్టుటకై కొన్ని వ్యర్థములగు మాటలాడితిని.
నేను నీహృదయేశునిఁ దెచ్చి యిచ్చెద. అప్పు డాతఁడు ఫ

కావున మూఢులకు లేదేమో యెఱుంగను గాని యింకొకా
నొక రూపవైభవాభ్యుదయము వినుటచే నాతఁడు నీపై మరి
కుపించును. దీనికిం దగిన కారణంబును భగవంతుని యొ
ద్దాటునుం గూడఁగలదు. అదెట్లందువేని యున్నొకనాఁడు
బ్రహ్మయును సరస్వతికిని బ్రణయ కలహమయ్యెను. ఆ
బ్రహ్మ తద్వియోగంబు సహింపలేక సరస్వతినిఁ బ్రసన్న
రాలిం జేయుట కెవ్వరు తగినవారని యాలోచించి నన్నుఁ
బిలిపించి తన పొలఁతి పొలయలుకం దీర్చుటకు నన్ను నియు
చుండి యాద్దేవి నుద్దేశించి యామె యనుగ్రహమువలన వే
దములు తనకు ముఖస్థమయ్యెననియు, సంగీతసాహిత్యము
లబ్బెననియు, నఖిలలోక వ్యవహారసిద్ధి జనించెననియు, నా
మె లేనిచో నడల శోక మనోదంష్ట్రైనను నొందవలసినదనియుఁ జె
ప్పి యాతఁడు నిందించినట్లు పలుకుమని నన్నాదేశించుచు
"ఓరీ! మన్మథా! నన్నేల యిట్లు వేధించుచుంటివి. పత్నీ
పతియును నెలఁతపై విరాళికారణముగా నీవును విట్టిపాట్లు
రానున్నదిలేదే?" యని మన్మథునిదూషించె. అప్పుడేనుతద్వా
క్యములు విని "ఓపరమేష్ఠీ! ఏమిది? మన్మథుని మనసు నా
కర్షించునది రతీదేవియై యుండఁగా నీవనిన వనిత యెవ్వతె?
అని నేను ప్రశ్నింప నాబ్రహ్మ నాకిట్లనెను. "సఖిసఖి!
తలిదండ్రుల యెక్కడిది? పరిభాషణి గూఢపదమెక్కడిది? ఆకాశ పాం

దర్యముకన్నఁ బ్రభావతి సౌందర్యము పదిరెట్లు, నూఱు
రెట్లు, వేయిరెట్లధికము. నా సృష్టియందా ప్రభావతి రూ
పమతి దుర్లభంబు. అది పార్వతీ వరప్రసాద సంజనితయై
పొలుపొందు" నని పలికి సత్వరము నన్నా సరస్వతి కడకం
పె. క్రమక్రమంబున నాప్రభావతివి నీవని తెలిసికొంటి.
నీప్రియుఁడు నీకంటె వేగిరించునని తోచుచున్నది. నీవు సం
శయముడిగ సుఖంబుండుము" అనిన విని యాప్రభావతి
సందియంబునొందుచు రాగవల్లరి ముఖమువంకకుఁజూడ నది
తదభిప్రాయం బెఱింగి "ఓహంసీ! నీవెంతమాటచమత్కృ
తి గలదానవే? హితవుగ నెంత చక్కఁగా నదికి చెప్పితివి.
కామునకుఁ బ్రభావతీ కాంక్ష గలిగినవోఁ బ్రద్యుమ్నుఁడు
విరాళి చెందుటెట్లు?" అని యడిగిన నమ్మరాళి పక్కున న
వ్వి "కాముఁడను వానిని మీరును విన్నారుగదమ్మ! ఆ
కాముఁడే తొల్లిఁటి సురూపశ్రీమించ రుక్మిణికిఁ బ్రద్యు
మ్నుఁడై పుట్టినాఁడు" అని శంకలన్నిటికిని బరిహారములు
చెప్పిన నా ప్రభావతి వేగిరపాటుతో "ఓమరాళీ! అట్లయి
నఁ దత్పుర మెంతదవ్వు? నీవు పోవుటెప్పుడు? ఏవిఘ్నము
లులేక నీవు పోయి నావిభునకు నాకోర్కె దెలుపు టెప్పు
డు? ఆపై నాపై నతఁడు దయఁబూను టెపుడు? పూనియు
చ్చుటకు వచ్చుటకేదే మిషఁబెట్టి తండ్రిసెలవు దీసుకొనుటె

ప్పుడు? అన్నియుఁ బొసఁగినను మాత్సర్యపుఁ బోఁడివగు నాతండ్రి నాకోర్కె కిష్టపడునా? తలకుమీఱిన కోర్కెలఁ గోరి మిమ్ములఁ బరితపించుటయే గాని యీవిరహవారిధి-దా టుటెన్నఁడైనను గలుగునా?” యని యొప్పిదిడి విచారిం చుచుండెను.

ఆసమయంబునం దెట్టయెదుట నొక చెట్టుననున్న వలయందుఁ దగుల్కొనిన యొక చిలుక భయముతో ఱె క్కలు తటతట కొట్టుకొనుచు నెగురుటకు యత్నించి యె గురలేక యక్కొమలి దృక్పథంబునం బడియె. దయార్ద్ర స్వాంతరంగయగు నాప్రభావతి వెంటనే చెట్టుకడకుం జని దాని కాలిబంధపుత్రాటిని వదల్చిన నది వేగముగా నాకాం త కేల్విడిపించుకొని యాకసమున కెగసెను. అట్లెగసిపోవు టలోఁ దత్పక్షంబుల సందుననున్న లేఖజాతి క్రిందఁబడెను. ప్రభావతి యప్పుడు శుచిముఖినిఁ జూచి “హంసీ! ఇది రా ణివాసస్త్రీలుండు చోటుగదా! ఈలేఖ యిందెవ్వరి కెవ్వరం పిరో విచార్యంబుకాన నాచిల్కంబట్టి తేఁగలవా?” యని యడిగిన శుచిముఖి యపుడా చిలుక వెంటఁ బరువెత్తెను. ప్రభావతి రాగవల్లరిం గనుంగొని “చెలియా! ఎంత వింత గానున్నది! మొదట నిచ్చట నెవ్వరు వలనొడ్డిరో” యని పలుకుచున్న నామెకు రాగవల్లరి “చెలీ! వియోగావస్థను

న్న నిన్ను బోధింప సఖులకెల్లను బట్టుటకై నేనీ యావల
నొడ్డితి" నని సమాధానమును జెప్పి యాలేఖ వైఖరి చిత్ర
మగా నున్నదని దానిం బుచ్చుకొని విప్పి

"సీ. శ్రీమత్సరస్వతీ రామాకృపాసంప్ర
యుక్తోప మాతిశయోక్తి కామ
ధేను సద్బిరుదాంక దివ్యమంజీర సం
శోభితపాదక శుచిముఖీని
బ్రియమ్ముఁ దూర్జిత ప్రేమపూర్వకముగా
వ్రాసినయట్టి రహస్యలేఖ
ప్రియప్రభాభావతిఁ బలుతెలుంగుల నీవు
వచియింప ... ... ..."

అని చదువుచుండగనే, యుబ్బిపోయి సంతోషము పట్టఁ
జాలక "నెచ్చెలీ! నిన్నుఁ గూర్చి నీమగఁడు వ్రాసిన లేఖ
యేగదమ్మ! నీవెంత భాగ్యవతివే" యని పలికె. ప్రభావ
తి యా పలుకులు విని "ఓసీ! ఆలేఖలో నట్లే యున్నదటే
లేక నన్నుడికించుచుంటివా? ఏదివదీ! నాకిటు చూపుమా"
యనుచుఁ జేరఁబోయి చేసాచిన రాగవల్లి "ఉండు! ఉం
డు! పూర్తిగా నన్ను చదువనిమ్ము పిదపఁ జూతువుగాని లే
యని యనుచుండ నామె మాటకా ప్రభావతి యడ్డువచ్చి
"ఓసి వెఱ్ఱిదానా! నీవు తప్పు చదువుచున్నావు నన్ను వ్రి

ద్యమ్ముఁ జనుగ్రహించు టెట్లు? అందు ప్రప్రభాభావతి యని వ్రాసియున్నది. నేను ప్రభావతినిగాని ప్రప్రభాభావతిని గాను. ఆలేఖ నాకీయనక్కఱ లేదులే. నీవే బాగుగాఁ జూచుకొనుమని విముఖతతోఁ బలికె. రాగవల్లరి చిరునగవుతో "చెలీ! ఇది నీపేరే! ఆప్రద్యుమ్నుఁడు భ్రాంతిచే నిట్లు వర్ణపునరుక్తిగ వ్రాసినాఁడుగాని మఱొండు గాదు." అని పల్కి యామె సందియంబును దీర్చె. "సరే ఎట్లుండిన నట్లుండనిమ్మ! మిగిలిన యుత్తరము చదువుము" ని ప్రభావతి యాజ్ఞాపింప రాగవల్లరి మిగిలిన భాగంబును

"సీ॥ ప్రప్రభాభావతిఁ బలుదెఱంగులనీవు
వచియింప నపుడు నిర్వచనవృత్తి
నేనున్కికల్ల గుట్టింతియెకాని యా
యింతి యంగములెవ్వి యెట్లుచెప్పి
తవియెల్లనట్ల నాయాత్మఁ దద్దయుఁబడి
యచ్చున నద్దినట్లమరనంటి
మలిచినగతిని మిక్కిలి దృఢత్వముఁజెంది
స్వగుణ సంపద్గౌరవమున నేమొ
గీ॥ యాఁడి బడలించుచున్న వి యోమరాళి
యధరసుధఁ దేర్పుమని వేఁడు మామృగాక్షి."
అని చదువుచుండ గొబ్బున నవ్వనిత చెలిచేతి లేఖ

లాగుకొనెను. రాగవల్లరి యింతముఖముచేసుకొని "సరే! పుచ్చుకొనుము. ఔను! నేనది చదువఁదగనిదే! వలపు తేట పఱచి వ్రాసినాఁడు కాఁబోలు నీప్రియుఁడు. నీవే చదువు కొనుము" అని హేళనచేసెను.

ప్రభావతి కోపలజ్జాలోలయగుచు నాలేఖను నలిపి వేయంబోయిన రాగవల్లరి యనేకములగు నొట్టులంబెట్టు కొని యట్లుచేయకుండ నామెను మఱలింపనెంచి "ఓసీ! చాలు చాలు! ఆలేఖ నాచేతికిమ్ము. లేకున్నఁ బదిలముగా భద్ర పఱుపుము. ఈజాబుతో నీకేమిపనియో మొదట చెప్పుము. ఆమహామహుఁడీలేఖ నాశుచిముఖిపేర వ్రాసినాఁడు. ఒకరి యుత్తరము లొకరు చూడరాదుసుమా! అదియుంగాక యాహంసిచూడకుండ మనలోమనమేయడంచిన దాని మన సెంత నొచ్చుకొనును. దానితోడి మనస్నేహంబునకును జా లదవ్వగు. వెండియు నీనడవడి నేనేమని చెప్పను. మగఁడు పంపినలేఖ భాగ్యవతులు కులదేవతలంబలెఁ బూజించి యే దేవుఁడు పెట్టెలోనో దాఁచుకొననగును గాని యిట్లు నలిపి వేయ నగునా? ఇంతకంటె నమంగళంబుగలదే?"యని పెద్ద ప్రాజ్ఞ బెదరించి బోధించి వారించె.

హంసి కొంతసేపటికిఁ జిలుకనుముట్టి పదంబులఁ బొ దిగిపట్టిన నది పెనఁగుచుఁ గీచు కీచుమని యఱచుచుండ

"ఓసీ! గొంతుచించుకొని చావక నావెంటరమ్ము. ఱెక్కల లో దాఁచుకొని యెక్కడెక్కడిలేఖ లెక్కడెక్కడికి నడు పుచున్నదానవు. నిన్నుఁబట్టి తెచ్చియిచ్చినఁగాని కదలనని మాపరిభావతి యచ్చటనేయున్నది. చూడు"మనిన నాచిలు క హంసికిట్లనియె. "చంపినఁజంపుము. నేనొక్కదానిని చని పోయిన నెందఱు చనిపోవుదురో తెలుసుకొనుము."

మరాళి యాపలుకులాలకించి "నిన్ను వదలకున్నఁ గా ర్యలోపములేమియును రావులే! లేఖ చేఁజిక్కినదిగదా! నీవు మొండితనముచేసినచో మిక్కిలి బాధనొందెదవు. నావెంట వత్తువేని యాపరిభావతికి నీపై దయపుట్టునట్లుచెప్పి నిన్ను విడి పింతు"నని యుపదేశించి యాచిలుకను వదలిపెట్టక బలిమిఁ గొంపోవు నాహంసి కాచిలుక యిట్లనియె. "ఓహంసీమతల్లీ! ఇంతపట్టుదలయేలయని యడిగెదవేని నారహస్యము చెప్పె దను వినుము. రహస్యము చెడనున్నప్పుడు దానినిఁ గప్పి పుచ్చినను ఆదాచుటవలని గుణమొకొక్కపుడు ఫలించును. దాచుమనికోరినపుడు ప్రకటించినచోఁ గొంచెమైనను ఫల ముకలుగదు. ఆపదయును తప్పదు. రహస్యమెవ్వరికినిఁ జె ప్పవలదనినప్పుడు చెప్పకున్న నొకప్పుడు ఫలించినను నొక ప్పుడు ఫలింపకుండినను హానిగల్గదు. కాని రహస్యము దాఁ చుమన్నప్పుడు దాచకపోయినఁ గొంచమైన ఫలింపకుండుట

యేకాక తప్పక హానికల్గును. కావున నేకాంతస్థలమున నిల్చి వినుము. ఆవెనుక నీకుఁ దోచినట్లు చేయుమువుగాని లే!" యని పలికిన హంసకాంత దానింగొనిపోయి యొక్క లీలా మహీధరంబుపై నిల్చిన నాచిలుక హంసికతో" తల్లీ! ద్వారకయను పురమున కేనొకానొక కారణమునఁ బోయియుంటిని. మరలి నేవచ్చునప్పు డొక సుందరమూర్తి యొకఁడొక యారామములో నతివ్యథాకులుఁడై "మీరా! మీరా! వజ్రపురంబునకుంబోవువార"ని కన్నవారినెల్లఁ బ్రార్థించుచుండ నేనువాని దీనాలాపంబులు విని వానిపై జాలిగొని వజ్రపురంబునకు నేనుబోయెద. నీకేమికావలయును. నా చేతనైనకార్యమేదైనఁ దప్పకచేసెద" నని యడిగి వానికి వాగ్దానమొసంగితిని.

ప్రద్యుమ్నుని దైన్యాతిభారంబు భావించి కారుణ్యపరవశత్వము నొందినదాననై యాపని నావలన "నౌనా కాదా"యను విచారంబుమాని యీలేఖ నిచ్చుటయేకదా? ఇదియు నొక ఘనకార్యమేనా! ఈమాత్ర ముపకృతిసలుపలేకున్న నున్ననేమి? లేకుండిన నేమి? యని యోజించి యాలేఖను నారెక్కల సందునఁ గట్టించుకొని వచ్చి యిప్పు డప్పువ్వుఁదోఁటలోఁ దక్కన్యకా పరిచయంబు వనున్న నిన్నుఁ బరికించి యొక్కింత యక్కజముపై వ్రాలితి. అ

కట్టా! నా ప్రారబ్ధ మేమనవచ్చు! దానిపైనున్న యురినిఁ దగుల్కొని యిప్పుడీపాట్లకు లోనైతి” నని విన్నవించె.

“పక్షి పేర వ్రాసిన పత్రిక నంపినవాఁడు మిగుల భ్రాంతుఁడు గావలయు. నీవా నగరమునకుఁ బోవఁ బని యేమికల్గె? యథార్థము సెప్పు” మని యాహంస చిలుక ను నొక్కినొక్కి యడుగగా నాచిలుక నీళ్లు నమలుచుఁ జె ప్పుటకు భయపడుచుండ నారాజహంసి దానిని బిగియఁబట్టి కదలనీక ద్వారకకుఁ బోవుటకు నీకేమి పనిగలదో చెప్పు మని మరల నిర్బంధించిన నాచిలుక రహస్యంబు వెలిపుచ్చు టుచితంబుగాదనియు, నాపె కెంత యాపద వాటిల్లినను చె ప్పనని భీష్మించుకొనియుండె. మెడమీఁదగత్తిఁ యుండిన ను దమ్ము పోషించువారి యేకాంతమును దారు వెలిపుచ్చ రుగదా! హంసియు నిజవాక్చాతుర్య మేపార నాచిలుకమ నంబెట్లో త్రిప్పివేసి యారహస్య మెవ్వరికినిఁ దెలియనీనని గట్టిగా వాగ్దానముచేసి యొట్టిడుకొనియె. కోరిన బాస యొక్క యవలంబనము నూతగాఁగొని యాచిలుక తాను ద్వారకకుఁ బోయిన కారణంబు నిట్లు చెప్ప మొదలుపెట్టె.

వజ్రనాభునకు సునాభుఁడను రాక్షస సోదరుండు గ లఁడు. వానికి ననుపమాన సౌందర్యరాశులగు చంద్రవతి, గుణవతియను నిరువురు కుమార్తెలు గలరు. సునాభుండొ

క్కనాఁడు నిండుసభనుండ నచటకు నారదముని యేతెంచె. వానికా రక్కసుండు వినయగౌరవ పూజలొనర్చి సేవకుల నిచ్చి వానిని నంతిపురంబులోని కంపె. అంత నచ్చట సునాభుని భార్యలు నారదు నెదుర్కొని మ్రొక్కి పూజించిరి, నారదుండును వారి దీవించి చంద్రవతీ గుణవతులున్న చోటికేగెను. వారును భక్తితో నామునికిఁ బ్రణమిల్లినఁ బతి మనోవల్లభలై పుత్రవతులై తేజరిల్లుడని వారి నతఁడు దీవించె. అప్పు డచ్చటి దాదులా మునిని నవలోకించి "మహాత్మా! ఈనాతులకుఁ బతులెవ్వరు కాఁగలరో యానతీయఁ వేఁడెద" మనిన నామునికులతిలకుండు కొంచెమాలోచించిన వానివలెఁ గన్పట్టి "ఓనారీమణులారా! వీరికి ద్వారకానగరవాసులును యదువంశజులునగు గదసాంబులనువారు నాథులు కాఁగలర"ని యానతిచ్చి యాతఁడు వెడలి పోయె.

అంత నాదాదులు మిక్కిలివిచారముతో "అయ్యో కుడిచి కూర్చుండి వెతదెచ్చుకొంటిమి. ఎక్కడి ద్వారక? ఎక్కడి గదసాంబులు? వారసురులకు గర్భవిరోధులును, తత్పురము పగవీడునుగదా! ఈవార్త మా భూభర్త చెవిం బడిన మా మానప్రాణంబులు దక్క" వని వగచి యాపలుకెందును బయటికి రానీక తమలోఁ దామే యడఁచుకొని

యుండిరి. కాని యీ దనుజకన్య లాతాపసవాక్యము విన్న
ది మొదలు గడసాంబుల యందలి కూర్మి పెంపొంద నాటి
నుండి నియమంబులఁ బాటించుచు, నోములు నోముచు
దానధర్మవర్తనములు సల్పుచుఁ దద్గడసాంబుల క్షేమలాభై
శ్వర్యంబులే కోరుచుండిరి. నన్నా చపలాక్షు లిద్దరు ని
చ్చమెయిఁబెంచి కడుంగడు మచ్చికతోఁ జూచుచుందురు.
నేనును వారి మన్ననలకు మెచ్చుకొని వారి కేమి ప్రత్యుప
కారంబు సేయఁగలదానని యోజించుచుందు. ఇట్లుండ వా
రికిఁ బ్రియమునిండుచు రా నాగడసాంబుల యందలి ప్రేమ
భూజము విస్తరిల్లఁ దొడంగె. అంత నేనొక్కనాఁడు వారి
యవస్థలఁ దిలకించి "వనితలారా! మీరేల వట్టికై విచా
రించెదరు. మీ వల్లభుల శుభస్థితి నుపాయముచే నెఱింగి
వత్తు. మాటలవెంబడి మీ ప్రసక్తియుం దెచ్చి మీకో
ర్కులఁ జెప్పుట కవకాశమున్నఁ జెప్పి వర్తమానముం జె
చ్చెరఁ దెచ్చెద" నని వారికి ధైర్యంబు నూల్కొల్పి యపు
డ కదలి వచ్చుచుండ నాలేఖ యిట్లు ప్రాప్తంబయ్యె. నన్ను
ప్రభావతి చూచి గుర్తించెనేని చంద్రవతీ గుణవతుల కేమి
కీడు వాటిల్లునో యని నామనంబెంతయు వంతం బూనియున్న
ది. ఆవనితామతల్లులకు నాపునర్దర్శనంబునకై నేఁడు గడువు
పెట్టితి. నేనుం బోకున్న వారెట్టి యవస్థలకుం బాలౌదు

రో నీవ యెఱుంగుదువు. కావున నన్ను ననుగ్రహింపుమ
ని బ్రతిమాలుకొనియె. హంసి యాపలుకులు విని "ఓసీ!
తప్పించుకొనిపోవుట కెన్ని యెత్తులు వేయుచుంటివే" యు
ని పరిహాసమునకుఁ బలికి "నేను నిన్నిపుడు విడువక నీవెం
టనే వచ్చెద. అప్పుఁడతులం బిలిచి నావలన నీకగు నుప
కారము వారితోఁ జెప్పి నాయెదుట నీవు పల్కినది యథా
ర్థమని వారిచే ననిపింతువేని నిన్ను విడిచిపెట్టెద లేకున్న
విడువ" నని భయపెట్టిన "నట్టులే చేసెదనులే" యని చి
లుక యొడంబడియె.

చిలుక హంసితోఁ బ్రక్కలనుండు చోటరయుచు
సునాభుని కన్యలు వసించు నంతఃపురమునందొక మేడయొ
క్క కపోతపాలికమాటున వ్రాలి పెరవారెవ్వరును లేకుం
డఁ జూచి స్వచ్ఛమగు స్వరముతో నాకన్నియలం బిలిచె.
ఆకన్నియ లాచిలుక యెలుంగు వినుచుఁ దటాలున రంజి
ల్లు నుల్లంబులతో నరుగుదెంచి హంసికావృతమగు చిలుక
తెఱంగుఁ జూచి మిగుల సంకోచించుచుండ దానిని గ్రహిం
చి యాచిలుక "ఓ కన్నియలారా! మీరలీ హంసిం జూ
చి సంకోచింపవలదు. ఇదియు మన పక్షములోఁ జేరినదే.
మన కార్యమున కిది యనుకూలమే" యని తనకును దాని
కినిఁ బ్రాపించిన సంబంధంబు తెఱంగంతయుఁ జెప్పి "మన

పని మీచేత స్పష్టముగాఁ బలికించుకొని మీకుపకారంబు సేయ నిచ్చటకు వచ్చినది" అని చెప్పి తత్ప్రార్థనావశీకృత హృదయయగు హంసిచేత విడువంబడి యాచిలుక చంద్రవతీ గుణవతులతో గదసాంబుల వృత్తాంత మిట్లని విన్నవించె.

"చంద్రవతీ" ఇంద్రనిభుఁడగు నీవిభుఁడు గదుఁడు ద్వారకలో సుఖంబుననున్నవాఁడు. గుణవతీ! గుణరాశి యగు నీ ప్రియుఁడు సాంబుఁ డెంతయు శుభంబుననున్న వాఁడు. నా చాతుర్యంబు మెఱయ వారిరువురితో మైత్రి యొనర్చి యొకరెఱుఁగకుండ నొకరి యొద్దకుంబోయి మీ యభీష్టములం దెలిపి మీ బ్రతుకులు వారుపేక్షించునంత దనుక యుండునవియనియు వచించితి. వారు మిగుల విచారించి యేయుపాయముచేతనైన వరింతుమనియు, నింతలోన వారు ధైర్యమువిడి దేహత్యాగము చేయుదురేని సాత్మహత్యాసంజనిత పాపఫలంబనుభవించుటయేకాక పతిహనన పాతకంబుసైతము మూటగట్టుకొనిన వారగుదురు." అని వచించిరి.

ఆకన్నియ లావాక్యములాలకించి చెవులుమూసుకొని "వారు దీర్ఘాయురన్వితులగుదురుగాక. వియోగసంద్రంబున నేను మునిఁగిపోక తమపలుకులవలని యపేక్షయే

పెనువావగా నీకును దుంకుము. మా ప్రాణసంరక్షయందుం దగినతోడ్పాటు వారికిం దోచుదాఁక నోర్పుటయే కాక వేగిరించుట తగునా" యని యూరకుండిరి.

శుచిముఖి "యాకన్నియలం జూచి" చెలులారా! మీరు విచారింపకుఁడు. మీకతులిచ్చుటకు వచ్చుట కుచితోపాయంబు నేను గల్పించెదను లెండు, నేనుం బ్రభావతికిం బ్రాణసఖినై యుందు. ఆమె పంపున నేనిప్పుడీ చిలుకను వెంబడించి వచ్చితిని. ఇది నిమిత్తంబు గానైన మీతోడి మైత్రి దొరకె. నాకింకిక్కడ జాగు సేయఁదగదు. అచ్చట మీ రహస్యంబు బయలుపఱచక తగిన సమాధానంబు సెప్పి కప్పిపుచ్చెద. భయముదక్కి మీరు నిశ్చలములైన చిత్తంబులనుండు"డని చెప్పి యాయంగనల వీడ్కొని ప్రభావతికడకుం బోయెను.

తన రాకకై వేచియున్న ప్రభావతిం జూచిన తోడనే హంసి "చెలియా! నీయదృష్టమేమందును! అది నీయందలి ప్రేమచే నీప్రియుఁడు నీకై చింతించి వ్రాసి యనిపిన యుత్తరము కాదా! యని పరిహాసించెను. ఆకాంతారత్నము నవ్వుచు "ఓసీ! నీకడుపు కండవిత్తుఁగాను! ఆయుదుగపలసిన మాటలు నేనేయడిగియుందును. ఆచిలుక నిచ్చుటకుఁ దేక యేలవిడిచి వచ్చితివి? అని నిందించినఁ బ్రభావతికా శుచి

ముఖి "సఖీ! నీపతి నీకై వగచుచు నాపేర లేఖవ్రాసినాఁ
డని యాపులుఁగువలనఁ దెలిసికొనినదానవై సంతోషము
నింకఁ బట్టజాలక దానిని విడిచిపెట్టితి. మనకిమ్మని యా
తఁడు పంపిన యుత్తర మొసలచేకుబంపఁడక మనకేదిక్కా.
అదే పదివేలు. ఆపిఁక నెటుపోయిన మనకేమి" యని
యామెకు మారుమాటాడుటకైన సందీయక పల్కి రాగవ
ల్లరిం గనుంగొని "ఆలేఖయందు నేఁజెప్పినట్లే యున్నదిగ
దా! చక్కఁగాఁ జదువుకొంటిరా" యని యడిగె. రాగవల్లి
రి "హంసీ" ప్రభావతి నన్నంతయుఁ జదువనీక యాలేఖను
బలవంతముగా లాగుకొనియె." నని బదులుపలికె. దానికి
శుచిముఖి సందర్భసముచితంబుగా "ఔనౌను." అటమీఁ
ద మనకుఁ దెలియుట న్యాయమునుగాదు. ఇతరులకు బయ
లుపఱుపరాని ప్రేమసంగతులు ప్రియుఁడేమేమి వ్రాసెనో
యువిదయన్నియు నామెనే చదువుకొని సంతోషించనిమ్ము.
ప్రభావతియనఁబోయి ప్రప్రభాభావతి యని వ్రాసిన యా
భ్రాంత్యావిష్టుఁడేమివ్రాయుఁడు? నేను ప్రభావతి గుణాగ
ణంబులు వర్ణించి వానికిఁ జెప్పినప్పు డాతఁడు విరక్తిస్థిరుఁడై
నట్లు కనిపించి వెంటనే విరహార్తుఁడయ్యె. అది నేను వివరిం
పలేదు. రూపయౌవనాదులం దనకు దగిన యింతి తన్నువ
లచినదని విన్నవించిన వాని మనస్సు చలింపకుండెననుట కది

యినుమా! తాయియా! వజ్రిమా! నీవు సిద్ధసంకల్పవు.

ప్రభావతి యాపలుకులు విని "ఏమి యీవెఱ్ఱి! నా కెక్కడి సిద్ధసంకల్పత. ఇంకను నావగింజలో నరసగమైనను కాలేదు. నావిచారముడుగు టెన్నఁడైనను కల్గునా! అక్రోమ లాంగుఁడు నాకై యెంతయలసెనో? ఎంతకుందెనో? కట్టా! తొంటికంటె నావిచారమిప్పుడినుమడించె. దీనిం దరియింపఁ దెరు వేది? వాని నల్లునిగాఁగైకొనుటకు మాతండ్రి సుంత యు నిచ్చగింపఁడు. వానియాజ్ఞలేక మాపురమెవ్వరునుగా ని చొచ్చుటకు వీలులేదు." అని విచారించుచుండె.

శుచిముఖి యామె దీనాలాపములువిని దయారసం బు మోముననివ్వటిల్లఁ బ్రభావతీ! నీవుపలికినదంతయు నిజ ము. నీవిభునిరాకకు నీతండ్రి సమ్మతింపఁడు. దీనినిసాధించు కొనుటకొక్కయుపాయంబుగలదు. అదినేనెఱుంగుదును. నే చెప్పినట్లుచేయుదువా!" యనియడిగె. ప్రభావతియామాటలు విన్నతోడనే యాశుచిముఖిని దగ్గరకుఁజేర్చుకొని "నీచెప్పి నయట్లు తప్పకచేసెద." ననియొట్టుఁబెట్టుకొనెను. "అటులైన నీకనువైన సమయంబున నన్ను సరసకథాకథనప్రవీణయని యు, సకలవిద్యాధురీణయనియు, నెట్టిప్రభువులనైన వేడుక మాటల నిట్టె మెప్పించునదనియు, నీతండ్రితోఁజెప్పి నన్ను వాని సమ్ముఖంబునకు రప్పించుకొనునట్లు చేయుము. అంత

టమీఁదకార్యంబునకు దైవంబుగలఁడు. నేనిచ్చట కొలంకు లనే యుండెద. నన్నుఁ దీసుకొనిరమ్మని మీతండ్రి యా జ్ఞాపించినతోడనే పిలిపింపు"మని చెప్పి హంసి వారిద్దరను వీ డ్కొనిచనియె. ప్రభావతియు సఖీ సహితయై యింటికేగె.

## చ తు ర్థా శ్వా స ము .



ఒకనాఁడు వజ్రనాభుఁడు రాణివాసమున నాట్యాగా నకళావిశారదలగు చంద్రవదన లూడిగము సేయుచుండ సంతోషసాగరంబున నోలలాడుచుండె. ప్రభావతి యదియ్యే దియే యదనని మదినెంచి తండ్రిని సమీపించిన నాతఁడు వత్సలతయు గారవంబును వెదచల్లెడు మాటల నాబోఁటి నాదరించెను. అంత నకాఁంత యెట్లో ప్రసంగంబు తెచ్చి "తండ్రీ! మనబొడ్డన బావులలో ననుదినంబును నొక హం సాంగన సంచరించుచుండు. దానిప్రజ్ఞ యేమనిచెప్పను. అ ది విద్యలగని. దానిని శుచిముఖియందురు. ఎప్పుడైనఁ జూ చితిరా?" యనియడిగెను. వజ్రనాభుఁ డాశ్చర్యముతో "అటులనా! నేనెప్పుడును వినలేదే? అదియంత విద్వాంసు రాలా?" యని యడిగిన ప్రభావతి సంతసించుచుఁ విద్వాం

సురాలా! యని యడిగెద రేల! వచోనిపుణత్వమునందును,
సత్కథారచనలయందును, నీతివివరత్వమునందును, దానికి
సరియగు వారెవ్వరును లేరు. తచ్చాతురతా విశేషములు
నీవు ప్రత్యక్షముగాఁ జూడవలెనే కాని చెప్పిన నేమిలాభ
ము" అని ఆశ్చర్యముతోఁ బలికె.

దైత్యపతి యామాటలు విని కూతుమాటలు మెచ్చు
సేయుచు "అమ్మా! దానిని రప్పింపవే చూచెదము." అని
ప్రియమారం బలికిన నాప్రభావతి చెలికత్తెను బంపిన నది
పోయి హంసినిఁ దోడ్కొనివచ్చె. శుచిముఖి యరుదెంచి
రాజునకు వందనమిడినఁ బ్రభావతి హంసింజూచి "శుచిము
ఖీ! నీవిద్యావిలసనంబు చూడవలయునని మాతండ్రి వేడుక
పడుచున్నవాఁడు. శాస్త్రప్రసంగంబు చేయుమనికోరెను.
హంసి వజ్రనాభునెదుట కుంజని వినయపూర్వకంబుగా వీ
నులకు సుధారసముల సోనలువర్షించు మృదులస్వరంబుతో,
దనుజాధినాథుఁ "[illegible]" యని మెచ్చునట్లు కావ్యనాట
కాలంకార శాస్త్రప్రశంసలఁజేసె. అద్దనుజనాయకుం డపరి
మితానందభరితుఁడై "శుచిముఖీ! నీముఖంబవలోకించిన
నానాదిగంతసంచారిణివై శుచిత్వంబు గడించినట్లు తోఁచు
చున్నది. నీకనినయద్భుతంబు లేమైనం గలవేని వీనులవిందు
గా వినుపింపుమని యడిగిననాయంచ యించుకాలోచించిన

ట్లు నటించి "రాజా! నేఁజూచినచోద్యంబు లెన్నియోకలవు.
అందున నాకతివిచిత్రమైతోఁచిన దొక్కటి చెప్పెదవినుము.
మునుప్రాక్చోట భద్రుఁడను నటుఁడు తాపససభలో నిజా
త్యద్భుతంపునాట్యపటిమ పెంపువడసి యేసుదీవులను సంచ
రించుచున్నవాఁడు" అని యతని నాట్యములవేళఁగల య
ద్భుతములు చెప్పిన దానవేంద్రుఁ డాశ్చర్యకౌతుకాయత్తా
త్ముఁడై "ఓశుచిముఖీ! నేనును గొంతకొంత యానటనవిష
యము వినియుంటి. వానినిఁ జూడవలయునను వేడుకకలదు.
నీవన్నిటనుగూడఁ బ్రవీణవై కన్పట్టెదవు. ఆనటు నిటకుఁ దె
చ్చితివేని నీకుమంచి బహుమానమిత్తు"నని ప్రియమొప్పఁ బ
లికె. శుచిముఖియుఁ గొంచెమాలోచించి "అట్లే చేయఁ
జూచెదనని పలికి వానికడ సెలవుగైకొని ప్రభావతిం జూచి
అమ్మా! పోయివత్తు"నని పలికె. ప్రభావతిలేచి సాగనంపుట
కుఁ గొన్నియడుగులు ముందువైచిన నాహంసి "ఇవంత
యును భవత్ప్రియార్థమే సుమీ! ననుమఱవకుమా" య
ని గూఢవృత్తిఁ దదిష్టసాధనపరతసూచించి ద్వారకానగరం
బునకుంబోయి తాను వజ్రనాభుచేత భద్రనామధేయ
నటునిఁ దోడ్కొనితెచ్చుటకు నియుక్తయగుట కృష్ణునకె
ఱింగించి, వజ్రనాభుని తమ్ముఁడగు సునాభుని కూఁతులుగద
సాంబులకు భార్యలుకాఁగలరని నారదవచనంబుల కలిమి

యుఁజెప్పి ప్రద్యుమ్నునకు సురజయ సాహాయ్యంబునకుప
గద సాంబులరుగు వారని నిశ్చయించిన యాకృష్ణుని నిశ్చ
యంబువిని యది తదీయశాసనంబున వాసవునకు విన్నవింప
దివంబునకుఁ జనుచుఁ బ్రద్యుమ్నునింటికేగి యప్పుడతండు
ప్రభావతీ వియోగతాపాతిభారంబున నొగులుచు నిజాగమ
నంబు కోరుచున్నవాఁడు గావున నాతనిచే గౌరవంబువడసి
యేకతంబున

ప్రద్యుమ్నా! ఒకచిల్కచేత నాకుత్తరము నంపితివే
ప్రద్యు:—పంపినాఁడ నది నీకందెనా?
హంసి:—నీవెవ్వరినిఁగూర్చి పంపితివో యదివారికే చేరెను.
ప్రద్యు:—ఓహంసీ! ఆకోమలాంగికి సేమమేకదా?
హంసి:—ఆలేఖఁదొందుటచే సేమమే యనవచ్చు.
ప్రద్యు:—మునుపట్టి కొదువవచ్చుటకు మూలమేది?
హంసి:—నీవు దైన్యపడి లేఖ యేటి కంపితివి?
ప్రద్యు:—ఆకాంతపై నాసక్తిచే—
హంసి:—ఆకాంతయు నీపై నట్టియాసక్తితోడనే యున్నది.
ప్రద్యు:—ఆసించుట కామె నన్నె మెఱుంగును?
హంసి:—నీచెలువము నాశివ లిఖించి యామె కిచ్చుటచే
ప్రద్యు:—ఏటి కిచ్చెను?
హంసి:—నీవామెకు భర్తవగుటను

ఆచందంబున సంభాషించి ప్రిభావతి కోర్కెంజెప్పి "ప్రిద్యుమ్నా! ఆపె కోర్కె దెల్పుటకేకదా నాఁడు నీక డ నామెం గూర్చి పొగడఁ దొడంగితిని. అపుడాకించుక యు నీవు మనసిచ్చి నాతోఁ మాటాడమి నేనూరకుంటి. ఆప్రిభావతి నన్నత్యంత ప్రియసఖినిగా నడుపుకొన్నది. కా వున నామె గుట్టంతయు నే నెఱింగినదే!" యని పార్వతి ద యచే నాతని మగనిని జేసిన విధమును జెప్పి ప్రిభావతికి వానియందుఁగల యనురాగంబు నిట్లని వర్ణింపఁ దొ డంగె. "ప్రిద్యుమ్నా! నీప్రతిమ నామె చూచినతోడనే రా గకుతూహల విస్మయంబు లంకురింప నష్టచేష్టారహితయై నిలువఁ బడిపోయె. ఎల్లప్పుడు నినుఁ జూచుట కామె మ నం బువ్విళులూరుచున్నది. తానే నిన్ను వెదకికొనుచు ని టకు రాసాహసించి నీరూపమెదుట కాన్పించినతోడనే ల జ్జచే మరల వెనుకకు మరలుచుండును. వేయేల? నీవు లి ఖించిన లేఖ యానిమిషములో రాకుండెనేని నాలతాంగి మరణించియే యుండెడిది. ఆలేఖ యుపకారంబును తా త్కాలికస్థితి కారణంబగు టొక్కటియే గాని యది మిక్కి లి సంతాపంబు గలిగించుచున్నది. అదెట్లుందువా?

"కం. క్రిందటి దినములు విరహా ద

గ్ధం దానలఁగుటయు కాని సరిగ నిపుడు నీ

వుం దనకై కుందుట విని
మెం దరుణికి నింక నిమిషమేఁడై తోఁచున్.

రాజా! ఇంతుల తాల్మి క్షణభంగురము సుమా! ఎంత శీఘ్రముగా నామెను రక్షించెదవో? ఆచెలువ భాగ్యము నీ చిత్తముపై నాధారపడియున్నది" అని యామె యవస్థ విన్నవించె.

ఆమాటలాలకించి యదుకుమారుఁడువిని కుమారికి "హంసీ! నాకు రెక్కలున్నచో నెంత బాగుండును. ఇప్పుడే పోయి యక్కొమ్మ మేడపై వ్రాలకుందునా? వెండియు నాకు ష్టరాత్ముని సమ్మతిలేనిదే యెవ్వరును దత్పురమును జొఱరాదఁట. దానికై మిక్కిలి పరితపించుచున్నాఁడ. ఆయుపేంద్రుఁడును నింద్రుఁడును నాలోచింపుమని యేమన్యెను?" అని యడిగిన శుచిముఖి యతనిఁ జూచి "కుమారా! తత్పురప్రవేశోపాయంబునకైన చింత నీకు వలదు. తదుపాయంబు హరియే నిశ్చయించుకొని యున్నవాఁడు. వజ్రనాభవధకార్యంబునకు నేనునీయిష్టసాధనానుకూల్యంబు చింతించి నిన్నే యనుపునట్లుగాఁ జేసితి. వాసుదేవుఁడిప్పుడే యీపనికై నిన్నుఁబిలిపించి యనుపనున్నవాఁడు. ఇంద్రునకిది యెఱింగించి వజ్రపురంబు కుంబోయి యేను తగినతెఱంగున నీపనికిం దగు సహాయంబు చేయుచుండెద"నని యన్నియుఁజెప్పి యాతని వీడ్కొని చనియె.

అంతఁ గొంతవడికి గోవిందుండు ప్రద్యుమ్నుని, గద సాంబులను బిలిపించి గరోద్ధతుండగు వజ్రనాభుని దేవహితార్థమై వధింపవలెనని యాజ్ఞాపించి యావజ్రనాభునిమహత్వంబును, తత్పట్టణప్రవేశం బన్యుల కసాధ్యంబగుటయుఁ, దాను హంసిచే సమకూడునట్లు చేసిన యుపాయంబును, స్పష్టముగాఁ జెప్పి యందుఁ బ్రద్యుమ్నుఁడు భద్రుని రూపంబును, గదుఁడు పారిపార్శ్వకుని యాకారంబును, సాంబుఁడు విదూషక వేషంబును ధరించి పోవునట్లనుజ్ఞయిచ్చి నియమించి వారిని దనుజపురికిఁబంపె. ఆముగ్గురును పరస్పరావిదితస్వప్రియాంగనా సమాగమానుగుణతచే నానంద మొందుచు "ఈప్రయాణము నాభాగ్యంబుచే నొదవె, నీయాత్ర నాయదృష్టమునం జేకూరె, నీ సన్నాహము నాపున్నెము నలభించె," నని వేఱువేఱుగా వారు వారిలో సంతసించుచుఁ బోయిరి.

ప్రద్యుమ్నాదులాట నేర్పు చూచుటకై వారసీమంతినీసంతతులతో, వైణికి, వైణవిక, మార్దంగిక జనాదినాట్యసామగ్రితో, భద్రున కేవి యెట్లులుండె నవి యట్లులుండ వజ్రపురంబునకుం బోయి తత్సమీపంబున విడిసి ప్రౌఢిమెఱయ నాట్యంబు నెఱపిరి. తన్నటనంబుతో వారి కీర్తి యెల్లెడలఁ గ్రిక్కిరిసిపోయె. ఆవార్త దనుజేంద్రుఁడు విని వా

రినిఁ బిలిపించి తమ నాట్యవిద్య చూపుమని వేఁడెను. అం
తట వారు నృత్యరంగస్థలికిఁ దదర్శనసన్నాహ విశేషముతో
నేగుదెంచిరి.

అంతకుముందే శుచిముఖి యట మున్ను పలికిన వి
ధంబున వచ్చి వజ్రనాభుని దయకుఁ బాత్రమై ప్రవర్తించు
చుఁ బ్రభావతికిని చంద్రవతీ గుణవతులకును తత్పతుల రా
క తెలియఁగఁజేసి ప్రద్యుమ్నునకుఁ బ్రభావతీ రాగ వృ
త్తాంతంబున నౌత్సుక్యంబుఁ బెనుచుచు నతిహర్షంబుగా రా
కపోకలు గావించు చునికిం జేసి యతనితోడ నేఁడు నీహృద
యవల్లభ నీనాట్యంబు చూచుటకు వచ్చునని చెప్పి యామె
రాఁదగిన మేడప్రదేశంబు చూపి వెడలిపోయె.

ఆనాఁడు వజ్రనాభుఁడు నానాబంధుమిత్ర సచివసం
ఘంబుతో నాస్థానమంటపమునందు నొడ్డోలగంబుండె. పరు
ల దృష్టి కగోచరమగు నొక. తావునందు స్త్రీలకుఁ బ్రత్యేక
స్థల మేర్పాటు చేయించి యావజ్రనాభుఁడు సంవిహితరం
గమంగళాచారుఁడని ప్రఖ్యాతి వడసె.

ప్రద్యుమ్నుఁ డంతట నాంది పఠించి ప్రరోచనము
నాముఖము దనరార నొప్పు ప్రస్తావనతో ముఖాదులగు
సంధులు సంధిల్ల గంగావతరణాది నాటకములాడె. పిదప
నాతఁడు భగీరథుఁడు మొదలగు వారి వేషంబుల ధరించి

నిజముగా భగీరథుఁడే యవతరించెనా యనునట్లు చూపఱ కుఁ దోఁపఁజేసియు, నిక్కములై కన్పట్టునట్లు కైలాసాదిప ర్వతముల రంగస్థలంబునం జూపియుఁ బెక్కువిధములగు తోఁటలను సృజించియుఁ బన్నిదము వేసినను నవి మనుష్యుల చేఁ గల్పింపఁ బడినవని నిశ్చయింపలేని తెఱంగునఁ జూ పుచుండినఁ జూపరులెల్లరు నాశ్చర్యచకితులై తమతమ నగ లనెల్లఁ దీసి వాని కిచ్చి వేయుచుండిరి. ఇవ్విధంబున నాతిమ్మ యదివ్యమాయాప్రపంచ సముదంచిత నాట్యవంచితులం గావించి రాక్షసుల ధనము నెల్ల నూఁచముట్టుగా దోఁచుకొ ని ఖేచరులకు వేడ్క పుట్టించిరి. ఆ ఛందంబునఁ బ్రద్యు మ్నుఁ డానందంబు గూర్చుచు నానాభూమికాధారణుండై భద్రుఁడై పొల్పుచున్నను, ప్రభావతికిఁ బ్రద్యుమ్నుఁడై కనుపట్టుచు, నాట్యంబునం దొకొక్క మిష గల్పించుకొ నుచుఁదా నానవాలుగాఁ బెట్టుకొనిన ప్రభావతియుఁగ్న కిటి కీవైపు సారెసారెకుఁ జూడ్కిఁ బఱపుచుఁ బ్రభువును స్తో త్రించునట్లును, ప్రభావతినిఁ దాను ప్రేమించినట్లును నిరుపు ర కిరు తెఱంగులఁ దోఁచుచందంబునఁ బైకి రాజును స్తుతిం చినట్లే కాన్పించునట్లు భద్రుఁడు తన పాండితీ విశేషంబు తేటపడ నిట్లనియె.

"చ. సకల విశేషశోధనముఁ జాలినదొరా నెరజాణవజ్రినా
భ, కులవతంసరత్నము, ప్రభావతిరోషితంతకంటకంబు, తా
వకమగుచూపునావముఁ బ్రియస్థిత రాగతఁ బల్వెఁగానన
త్యకలుషవృత్తినాసుకృతమంతయునేఁడుసుమీఫలించుటల్"
వెండియు నీవు నాపొందుఁ గల్గిన నెయ్యమును, మహోపకార
మును, నీవు పనిచిన హంసి చెప్పఁగా నెడతెగని నాట్యాసం
బంధముచేత నిన్ను సేవింపవలయునను కోరికపుట్టె. నన్నే
లికొనుము. నీ మనసు వచ్చినట్లు నీకూడికము సేతు. నేటి
తమి నీవు మదినిడుకొని మన్నింపవలయు".

ఆ మాటలా ప్రభావతి విని లజ్జపడి యాత్మానన
ము వాని దృక్పథమునుండి మరల్చుకొనెను. అపుడు ప్రభా
వతి ప్రక్కనున్న శుచిముఖి యామెను గనిఁ జూచితివే?
నీమగఁ డెంత శ్లిష్టార్థవాక్యములఁ బల్కుచుండెనో? ఈరా
త్రి నిన్ను దర్శింతునని యర్థాంతరమునఁ దెల్పుచుండెనె
ట్లాడఁగూడునో యని నీవు సంకోచింప నక్కరలేదు. నీమ
గఁడన్నిటను జాణ. అన్య్లెఱుంగకుండ నీకుం దెలియు
తెఱంగున నెట్లు వచించినాఁడో చూచితివా?" యని యా
మె సందేహశల్యంబు నూడబెఱికి వెడలిపోయెను. ప్రభా
వతి రాగవల్లరీ సహితంబుగా గృహంబున కరిగ ప్రియస
మాగమత్వరమాణ మానసయగుచుండె.

సూర్యుఁ డస్తాద్రిపై వ్రాలఁ దొడంగె. సంజకెవి యాఱఁగట్టిన రక్తాంబర మాయనఁ గన్పట్టుచుండె. నిశాంగ నసొగసు దిద్దుకొనుటకుఁ గప్పవండి వెల్వరించిన మణికల్పి తదర్పణ మాయనఁ జంద్రుఁడు విరాజిల్లుచుండె. రాత్రియ ను స్త్రీ చంద్రుఁడను వెండిబిందెను పాలతో నింపి యాకా శమను పేరుగల శివున కభిషేకము సేయఁగా వేగముగాఁ బ్రవహించు పాలేలో యనునట్లు దట్టమగు వెన్నెలలంతట ను ప్రకాశించుచుండెను. ఆసమయంబునఁ బుష్పలావికలు తొలంకెడు హాసకాంతులతోఁ గన్నవల కల్పితనంబులతోడ ను, యువవ్రజంబును బ్రమయించి పువ్వులమ్ముచుండిరి. తదవసరంబునం దొక్క యువతి ప్రభావతికి విడులుగొని పోవుచుండె మాయామనుండగు వతిశ్వాసం డింపునఁ జరించు చు తేఁటిగమిలోఁ దానొక్క తేఁటియై యంతిపురంబునకుఁ బోయె. పతిసమాగమోత్సవ సముత్సాహంబునం జేసి ప్ర భావతి యంగుళీయక కంకణాంగద తారహార తాటంకాది సమ స్తభూషణంబులు ధరించి యాప్రద్యుమ్నుఁ డేచందంబున రాఁగలఁడో యని తలంచుచు, నెంతకు రామి వగచుచునం త దేదీప్యమానంబుగా వెలుంగు చంద్రునిం జూచియు, ద క్షిణా నిలునుద్దేశించియు నుపాలంభించుచుండె.

---

## ప ం చ మా శ్వా స ము.



ఆకన్యకా తిలకంబు మన్మథు నుద్దేశించి "ఇప్పుడు రుక్మిణీ సుతుఁడవయ్యునింకనువిరహుల బాధించుటయను పిశాచగుణము నిన్ను వీడలేదు. నిన్ననేల? అది నాభాగ్యము" యని పలుకుచు నంతకంతకుఁ బెల్లైన యాయుల్లకభరంబునం బెల్లగిల్లు నుల్లంబుతాల్మి నిల్వరింపఁ జాలక "ఆనాఁడే నాప్రాణముల నిల్పుటకు లేఖవ్రాసి యెంతయో శ్రమపడి నేఁడు దర్శనమిత్తునని చెప్పి యీగతిఁ విడువఁ జెల్లునే? అయ్యో! అంతయు వృథాయయ్యెఁగదా!" యని తెప్పలు తేలవైచుచు హీనస్వరంబున "ఓప్రద్యుమ్నా! ముందుజన్మకైనను నీవే నాకుఁ బతివై యాధర్మంబు నిర్వర్తింపు" మని పలుకుచుఁ బూఁబాన్పున వ్రాలఁబోయెను. ప్రభావతి కర్ణోత్పలమునందుఁ దుమ్మెదయైయున్న ప్రద్యుమ్నుఁడు సంభ్రమంబున నిజరూపంబుతో వెలువడి "ఇంతీ! ధైర్యము వీడకుము. ఇదె వచ్చినాఁడ" నని తానా తల్పమునందు నిలిచి యామెను దగ్గరకుం దీసికొనియె. అంత నాలతాంగి తదీయస్పర్శనామృతసేకంబున మూర్ఛదేరుచుండఁ గంపస్వేదలజ్జాత్మయయ్యె. అంత లజ్జావేశయగు నక్కాంత యోవరిలోనికిఁ బాఱిపోయె.

ప్రద్యుమ్నుండు శుచిముఖీరాగవల్లరులం జూచి "నాపూర్వపుణ్యభూమికయగు మీచెలి నన్నేలుకొన్నచో నేను సమస్తయౌవనులం దధికుండనని కన్నయశంబునాకుఁ దక్కును. ఇప్పుడామెను గాంధర్వంబునఁ బెండ్లియాడెద. మీతరుణియిల్లు జాగుసేయుటేటి నాయము. తోడ్కొని రండు. మీరలేకదా పెండ్లిపెద్దలు." అని పలికిన రాగవల్లరి నవ్వుచు నతనింజూచి "ఆమెకు నీయందున్న యనురాగమును జెలులకు వెల్లడించుతఱి నీవే ప్రత్యక్షముగాఁ జూచియుంటివి. అబ్బో! ఎంత చతురుఁడవయ్యా! సిగ్గుచే నిటు నిల్వక పాఱిపోవుటయు నొక తప్పుఁగా దలంచితివే!" యని వాని నొత్తిపొడిచెను. శుచిముఖ "ప్రద్యుమ్నా! నీవు సకలనాయికా స్వభావము లెఱింగినవాఁడవగుట నేనాకన్య చిత్తంబు నీకు విన్నవించెద. ఆమె నీరాకకై వేగిరించుట నీ వెఱుంగుదువు. ఆమె తప్పేమి కల్గినను నదియు నొక్క యనురాగవిలసన విశేషంబకా నెఱుంగుకొని యనుగ్రహంబు వదలక పరిగ్రహింపుము. నేఁబోయి యాముద్దియకు బుద్ధి చెప్పి తీసుకొనివచ్చెద"నని చెప్పి రాగవల్లరియుఁ దానును దత్సమీపంబునఁ దెరమఱుంగునఁ దమ పలుకులాలకించుచున్న ప్రభావతికడకుంబోయి యామెకు బోధించి లాగుకొనివచ్చిరి. శుచిముఖి పురోహితుఁడుగా రాగవల్లరి ముత్తె

దువగా, నభంబుసితచ్ఛత్రంబుగాఁ బంచభూతములు సాక్షులుగాఁ బ్రద్యుమ్నుఁడు ప్రభావతి కేలుదామకగ్రహింప నిరుపురక గాంధర్వవివాహంబుజరిగెను. "అయంముహూర్తస్సుముహూర్తోస్తు"ని శుచిముఖి యాశీర్వదించెను. ఆవధూవరులించుకసే పన్యోన్యపాణిసంస్పర్శసంప్రాప్తానంద స్తంభ పరీతాత్ములై ప్రపంచమంతయు మఱచిరి.

ప్రద్యుమ్నుండు తన సతీతిలకంబు నవలోకించి "ప్రేయసీ! ఇది మొదలు మాపులిచ్చటికే తెంచెద. తేపులందు మాా విడిదియందుండవలయు. లేకున్న మారహస్యమునకు భంగంబువాటిల్లిన మన మనోరథంబు విఘ్నంబగు. ఇచ్చట నుండి నానివాసంబుదాఁక భూవివరంబొండు గల్పించుకొని పోయెద. ఆద్వారంబన్యుల కెఱుకపడకుండునట్లుగా మూతవేయు"మని పలికిన నాకాంత యంగీకారసూచనంబుగాఁ దలయూప నుక్తప్రకారమునఁ బ్రద్యుమ్నుఁడు నిజనికేతనంబున కేగెను. ప్రభావతియుఁ దద్బిలంబుతగుతెఱంగున సంవృతంబుగావించె.

చంద్రవతీ గుణవతులట మున్ను నిజవల్లభ సమాగమంబున కుపాయంబుగానక శుచిముఖి తోడి విచారంబు గోరుచునుండుటంజేసి యమ్మరాళిసిఁ దమ నిలయంబున కెలయించుకొని పోవుటకు నుద్యోగించి ప్రభావతీ దర్శన

మిషంబున నచ్చటికేతెంచి యామె యుల్లసము దోచు మాట లాడుచుండిరి. ప్రభావతియు రహస్యభంగభయంబుచేఁ బ్రత్యుత్తరంబేమియుఁ దోఁపకునికి నిట్టటు గుబ్బగుచుండ నా శుచిముఖి యుది కనిపెట్టి చెలికుండ్రు గుట్టుమట్టుల నెల్ల నా మొకడ బయలఁబెట్టిన వారికిభిమతార్థహేతువని మనంబునఁ జింతించి ప్రభావతిని వెనుకవేసికొనివచ్చి వారినిఁ బరిహాసింపనట్లు "ఏమే! ఎంత యతిశయమున నుల్లసమాడెదరు! మీ రంద ఱు నొక యాకునఁ జదువుకొనినవారే! మా సుదతి యభీష్టము తొలుత సిద్ధించెను. మీఁదట మీ దికాఁగలదు. పెద్దపిన్నతనములవరుస రావలయుఁగదా!" యని చంద్రవతీ గుణవతులతోఁ బలికెను. ప్రభావతి యా మాటలాలకించి తెలివొందిన మొగంబుతో "ఎట్టెట్టా! వీర ల రహస్యము సైతము నీకుఁ దెలియునా! అంచతల్లీ! కొంచెము నాకుఁజెప్పు" మని యాత్రముతో నడుగుచుండ న మ్మరాళినవ్వుచుఁ గనసన్నలవలదని వారించుచున్న సూనాభు తనయులవంకం గనంగొని చెప్పసందేహించియు, మర ల నాప్రభావతిచేతఁ జెప్పుచెప్పుమని బ్రతిమాలించుకొని యు, నొట్టుబెట్టించుకొనియు "ఈకుదీయఁగాఁ జేసువచ్చిన ట్లు మీరీమెను గొంచము పరిహాసించుటచే మీరహస్యవు నడవడులను పూర్ణముగా బయలుపెట్టుకొనినవారైరి. ఆమె

మొట్టిదుకొన్నదింకఁ జెప్పకయుండరాదు." అని ప్రభావతి తోడఁ బ్రద్యుమ్నలేఖాహరణం బొనర్చిన చిలుక మాటలు మొదలుగా వారి ప్రియకృత్యంబు సకలంబునుం జెప్పిన నావు వ్వుఁబోఁడి నవ్వుచుసిగ్గుచేఁ దలవంచుకొనియున్న చంద్రవతీ గుణవతుల నీక్షించి

"కం. మునిముచ్చులార! మీచే
సినపని యటుగట్టిపెట్టి చేకొనియేలా
ననుఁదలిమితిరిఁక నేమియు
ననకుఁడు నాతోడిదొంగలైతిరి మీరుఁ ॥

అనిన నాయింతికి మరాళి యిట్లులనియె. "ఓలలనా! నీతోడి దొంగలగుటకు వీరెంతటివారుగావలయును. ఇప్పుడు నీప్రియునితోఁ జెప్పి వారలను రప్పింపకున్న వీరికి వీరిమగల రాక యెక్కడిది? నీవు నీప్రియునితో సిగ్గుచేఁ జెప్పక యూరకుందువేని నేఁడు నేనేభవన్నియోగముచేఁ జెప్పఁగ లదానను. అని తన్నయనచేష్టావిశేషంబున నంగీకారంబు వడసినదియై చంద్రవతీ గుణవతులంజూచి "ఓకాంతలారా! ఈ ప్రభావతికిం బతియైనవాఁ డఖిలలోకమహిమమహనీయుం డైన యొక్క దివ్యపురుషుఁడుగావునఁ దదనుగ్రహంబునం దక్క తక్కినయుపాయంబుల నీయంతఃపురంబు మీ వరుల కుఁ జొరనలవికాదు. నేఁడే మీప్రియులను దెచ్చి యిచ్చెద.

ఇది నిశ్చయము. నమ్ముఁడని చెప్పి హంసి వారినిండ్లకుఁ బంపి వేసెను.

ఇవ్విధంబున నావిరిబోఁడుల నమ్మించి యంచబోఁటి నాఁటిరాత్రి యాదవుల విడిదికిఁబోయి యేకాంతంబునఁ బ్రద్యుమ్నగదసాంబుల మువ్వురంగూర్చి "మీమీకార్యములు పూర్తిగా నెఱవేఱినఁగాని యీమీఁది కార్యంబిందుఁ బ్రనకుఁ దెలుపుటకు వలనుపడదు. మీమీప్రత్యేకకార్యములేమియు నొకరొకరెఱుంగరేమో? చెప్పెదవినుఁడ"ని యామువ్వురకుంగల ప్రేమయు వారికిం దెలిపి ప్రద్యుమ్నునింజూచి "ఓయీ! నీవొక్కఁడవే మాయావివిగావున నీప్రియురాలిని దర్శించితివి. అమాయకులగు నీయిర్వురును ధైర్యముపిడి యేదారియుఁ గానకున్నారు. వీరి యభిమతసిద్ధియు నీయధీనంబ. ఇందుకుందగిన యుపాయంబూహింపు"మనినప్పుడా మువ్వురుం బరస్పరరహస్యకార్యప్రకటనంబునకు నవ్వుచు నొండొరుల మొగంబులఁ గనుంగొని కేలి సల్పుకొనుచుండిరి. ఆసమయంబునఁ బ్రద్యుమ్నుండు శుచిముఖిం జూచి "ఓ మరాళవతంసమా! నీవాసునాభుతనయలకడకుంజని తమభర్తలిదె వచ్చెదరని చెప్పి వారిననువయింపుమని దానింబంచి తానును గదసాంబుల కిష్టసిద్ధియునగునట్లుగ నాత్మకల్పితభూవివరద్వారంబున దానవేశ్వర

కన్యాంతఃపురప్రవేశంబుగలిగించి ప్రభావతితోనుండె.

అచ్చటఁ జంద్రవతీ గుణవతులుఁ బతులచే నతులా నురాగ పూర్వకనివర్తిత గాంధర్వవివాహలగుచు సుఖం బుండిరి. ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుని నపూర్వనర్తన ప్రవర్తనంబుల వశవర్తించేసికొనుచుండె. నాట్యసమయంబులఁ బ్రద్యుమ్నునకు విదూషక పారిపార్శ్వకాదికృత్యంబులు సాంబుఁడు గదుఁడను నడపుచు దైత్యపతి మెప్పునకుఁ బాత్రులైరి.

ఇట్లుండఁ గొంతకాలంబునకు దనుజకాంతల యొడళ్లుచిక్కఁదొడంగె. చిట్టములుదయింపఁజొచ్చె. వారికి వేఱువేఱు వస్తువులం దినవలయు నను కోర్కె లధికమయ్యె. కపోల సీమలఁ బాండిమగనుపట్టె. వలగ్నములు విస్తరిల్లె. అంతనవ మాసానంతరమున నొక శుభదినమునఁ బ్రభావతి పార్వతి కుమారస్వామినివలెఁ బ్రభావంతుఁడను కుమారుంగనియె. చంద్రవతి సూర్యుంబోలిన చంద్రప్రభుండను సుతునిఁ బడసె. గుణవతికి గుణవంతుండును, గీర్తివంతుండునను నిరువురు కవలలుదయించిరి. కుమారులభ్యవించుచుం దొడనే పరిపూర్ణయావనులును, సకల వేదవేదాంగపారగులును, ధనుర్విద్యాసంపన్నులునగుచుం గన్యాంతఃపురంబున వర్తిల్లుచున్నంత రక్షణాధికారులవలన వారలయునికి నిజస్థితివిని వ

జ్రినాభుఁ డాగ్రహోదగ్రుండగుచు సభాసదులంగనుంగొని "ఓదానవముఖ్యులారా! చూచితిరా నేటికిఁ గాలమెట్లు వక్రించినదో! మ్రుచ్చులుగొందఱు నాకుఁ దెలియక నా యింటఁ జొచ్చి నాయనుంగు బిడ్డలం జేపట్టి తనయులంబడసి నారఁట. నాయింటికిఁ జెఱుపుకలంచినవారు నాశంబుగొం దకుందురే? శేషునినోట వ్రేలిడినవారును, శివుని ఫాలనేత్ర మున సెనగలువేప యత్నించినవారును బ్రాణంబులతో మనియుందురే? వారెవ్వరైననేమి? నిర్జరులైన నిప్పుడే స్వర్గమునఁ భగ్నమొనర్చెద. నాగులైనచో వారికీక్షణము ననే వినాశముగల్పించెద. నలువయేనైనవానిని నమలకయ మ్రింగివేసెద. ఇప్పుడే మీరుపోయి వారినిఁ బ్రాణములతో నిచ్చటికిఁ బట్టితెండు. వారిం దెలిసికొని తత్ప్రోవముమ గడఁ దేర్పవలయు." నని లావుపలుకులాడి వారిపై భీమబలుండ నువానిఁ బంపె.

భీమబలుం డుగ్రుండై చని ప్రద్యుమ్నుని కోపాగ్ని కింధనుఁ డయ్యె. ఆవార్త దనుజభర్త విని దండనాయకో త్తములను, దళవాయునిఁ బంపెను. వారును నాయుధపాణు లై పోయి వారిం బట్టలేక తిరిగిరాలేక యుందే మడిసిరి. వ జ్రినాభుఁ డత్యంత కోపాటోపదీపితముఖుఁడగుచుఁ దన త మ్ముఁడు సునాభుండును, సకల మిత్రామాత్యవర్గంబును, ర

తురంగమాతంగపదాతివార్తితపాద ఘాతంబులచేత భూత
లంబు వడవడ వడంక నద్భుతోత్సాహంబునఁ బేర్చి కోలు
వనలువు మిగిలి కన్యకాభవన ప్రాకారంబు చుట్టుముట్టె.
అప్పుడు తమ విడుదులనున్న ప్రద్యుమ్న గదసాంబు
లు పూర్వవిహితభూవివరద్వారంబున నాక్షణంబుప్రవేశించి
భీతివశంబున నొక్కచోటనే చేరియున్న తమ కళత్రంబుల
యుత్తలపాటు దీర్చి తత్పూర్వకృత్త దైత్యగాత్రంబుల నెత్తు
టం జొత్తిల్లిన యాయుధంబు తమ చేతులనయుండ సంభ్ర
మంబునఁ జనుదెంచి మ్రొక్కియున్న కుమారుల సంశ్లాఘా
వచనంబుల నలరించి రట్టియెడఁ బ్రద్యుమ్నుండు ప్రభావ
తిం జూచి యిట్లనియె. "ఓయింతీ! నీతండ్రి సాహసించి పై
బడనున్నవాఁడు. మేమిప్పు డుపేక్షచేసిన పక్షమున మా
కుఁ గడుంగడు ప్రమాదము వచ్చును. మేము యుద్ధమునఁ
బ్రవేశించితిమేని యెవ్వాఁడు మాచేఁ జచ్చునో యెఱుఁగ
రాదు. ప్రేయసీ! నీ మనంబునకుఁ జింత జనించిన నేఁ జూ
డఁజాల. నీతండ్రి విధమంతయుఁ జూచిన నాతఁడు పోరక
మానఁడు. పోరి నాచే హతుఁడు కాకపోఁడు. నేఁబోర
కూరక నిల్తునా నాకుఁ గీడువాటిల్లక తప్పదు. వజ్రనాభుఁ
డు వలయునా? నీకుఁ బ్రద్యుమ్నుఁడు వలయునా? నీమా
నదాఁట వచింపు" మని పలుకుచుండ వజ్రనాభుఁడు స్వసై

వ్యముతోఁ గోటను ముట్టడించి లోపలఁ బ్రవేశించుటకై
మీఁది కెక్కినఁ బ్రభావతి చూచి తమ్ముని, భర్తను, కు
మారులను, గాచుకొనుటకు వేఱు త్రోవగానక పితృవత్సల
భావము పాఱనూకి మూలనున్న పెద్ద ఖడ్గమును గొనివచ్చి
వానికిచ్చి దానవనాథుని గెలువుమని చెప్పెను. కాంతలు
ప్రేమపట్ల నెట్టికార్యమునకైన వెనుదీయరుకదా!

ప్రద్యుమ్నుఁ డాప్రభావతి పలుకులకు సంతసిల్లి గ
దాదుల నార్వురను వధూనిలయమునఁ గావలిఁ గాఁగ నిలి
పి తానొక్కరుఁడును పటురయమున వెలువడి బంగరు కో
టచుట్టును గత్తిం జేతఁ బూని తిరుగుచుండ నాకోట మేరు
వువలెను నాతఁడు ప్రభాకరునిచందంబునను వెలుంగుచుండె.
కోటచుట్టును ముట్టడించిన దైత్యసైన్యమరీచిమాలికల్లా సూ
ర్యునిఁ జూచినతోడనే పటాపంచలయ్యె. తన సేనలెల్లఁ
బాఱుచుండ వజ్రనాభుఁ డహంకారంబున మాఱిమును నెది
రించి "ఓరీ! దురాత్మా! నీవెవ్వఁడ వీపురమెట్లు చొచ్చితివి?
నాపురంబునఁ బ్రవేశింప నెవ్వరికిని వీలుగానట్లు లాబ్రహ్మ
నాకు వరమిచ్చియుండె. ఆదురాత్ముం డెక్కడ? ఇట్టి క
ల్లవరములిచ్చు నాబ్రహ్మ నొవ్వడగించెద" నని యిట్లే
మో ప్రల్లదములాడు రక్కసునిం జూచి మందహాసముసేసి
"మామా! నీవిప్పుడునాచేతినుండి తప్పించుకొనినఁగదా బ్ర

హాస్త్రను శిక్షించుట. నీదౌష్ట్యమే నిన్నింతకుఁ దెచ్చెఁగా
ని యాపరమేష్ఠి మాట కన్యతంబుగలదె?

"కం. మొదలను బురిఁ జొచ్చితి నీ
మదలన భద్రినట వేషమున హారిసుతుఁడగా
యదుకులజుఁడఁ బ్రిద్యుమ్నుఁడ
మదిచ్ఛఁ గైకొంటి నీకొమారిత నిందున్.

ఉ. కోరికఁదావకానుజునికూఁతులకుంబతులైనవారు మా
వారలె నాకువారికినవార్యబలుల్సహజాతయావనో
దారులుగల్గిరాత్మజులుతల్లులరక్షకునున్నవారు ప్రా
కారములోననీదారలగణ్యులఁబల్వురదిన్నమృత్యువుల్"

వెండియు నిన్నుం జంపుటకు నాచేతులాడకున్నవి. మా
తండ్రి విష్ణువునకును, నాకపతియగు దేవేంద్రునకును శరణు
జొచ్చి నీప్రాణములఁ గాపాడుకొనుము."అనిన నాతఁడాజ్య
మిడ్డయగ్నివలెమండిపడుచు "ఓరీపశువా! నిన్నిప్పుడేనమయిం
తు"నని వానిపైఁబెట్టిదంపుటంప వానగురిపించె. గదసాంబులు
కోపాటోపంబునఁ గోట వాకిండ్లు తెఱపించి దురాధర్షాటో
పమున సునాభాదుల నెదిర్చి పోరఁ దొడంగిరి. సురాసు
రులు ఘోరంబుగాఁ బోరుచుండిరని కేశవుండు శుచిముఖి
చారులవలన విని చూచు నౌత్సుక్యంబుతోఁ దార్క్ష్యవాహ
నుఁడై, చక్రాయుధుఁడై సత్వర మచ్చటి కేతెంచెను. ఇం

ద్యుఁడును ధనురాది సకల హేతిసమేతంబుగాఁ దన రథము
ను, దన సారథియగు మాతలిని ప్రద్యుమ్నునకు ననిపి, గ
దసాంబులకు ననన్యదుర్జయంబులైన దివ్యస్యందనంబులఁ బ
నిచె. దాన నానిర్జరులు పూర్వోత్సాహంబునఁ బోరుచుం
డిరి. విష్ణుఁడు తన చక్రమును ప్రద్యుమ్నునిచేతి కనిపె.
ఆచక్రము నతఁడు ప్రయోగించి వజ్రనాభుని శిరంబుఁద్రుం
చె. గదసాంబులు సునాభాదిదైత్యుల నుగ్రయుద్ధముచే
బొడిచి చంపిరి. అప్పుడే దేవతలు మందారవర్షమును ప్ర
ద్యుమ్న గదసాంబులపైఁ గురిపించిరి. దేవదుందుభులు మొ
ఱసె. రంభాద్యప్సరస్సంఘ మానందంబునఁ బ్రీతిఫలము
లేకయ నర్తనము లొనరించె. మాధుర్యగానంబున దివ్య
గాయకులా ప్రద్యుమ్నుని శౌర్యంబును గీర్తించిరి.

శరణాగతత్రాణ బిరుదాంకితుఁడగు నయ్యచ్యుతుఁ
డనాథలగు దైత్యస్త్రీల నూరడించి వజ్రనాభుని రాజ్యంబు
చతుర్భాగంబులుగా విభజించి వానికిఁ బ్రభావంతునిఁ జం
ద్రప్రభునిఁ గుణవంతుని, గీర్తివంతునిఁ బట్టాభిషిక్తులం గా
వించి కొడుకులను, కోడండ్రను బమ్మని, మఱదలిని న
త్యంత విభవంబు మెఱయం దోడ్కొనుచు ద్వారకానగరం
బున కరుగుదెంచి దేవేంద్రునిఁ దదీయస్థానంబున కనిచి స
కల సామ్రాజ్యవిభవంబు లనుభవించుచు, భక్తజనంబులం

బాలించుచు మహానందంబునఁ బొలుపొందుచుండె. ప్రద్యుమ్నుండును ప్రభావతితో సకలవైభవము లనుభవించుచు సుఖంబుననుండె.

సంపూర్ణము.

